

: మ. ఘ. వ. శ్రీ నైజాం ప్రభు ఫర్మానా :

" ఓ రజాకారు వీరుల్లారా! తెలంగాణాలో మీ ప్రతి ఒక్కడికీ కావలసినంత స్థలం ఫుచితంగా దొరుకుతుంది."



"ముక్కోటి ప్రజలంత కదలాలోయ్
ఒక్కటై స్వాతంత్ర్య మొందాలోయ్"

# అభ్యుదయ

సచిత్ర సాహిత్య మాసపత్రిక


| సంపుటి 2 | 1948 మే | సంచిక 6 |
|---|---|---|




## తెలంగాణా ప్రత్యేక సంచిక

వెల రూపాయి

## ★ సూచిక ★




Editor, Printer & Publisher : K. Vinayaka Rao
Secretary, Andhra Progressive Writers' Association, Governorpet.
Printed at Abhyudaya Press, Vijayawada.

సంపుటి 2 | సంచిక 6

# అభ్యుదయ

మే 1948

ఆంధ్రాభ్యుదయ రచయితల మాసపత్రిక

---

# తెలంగాణా సమరం

## ధనస్వామ్యానికి కాదు; ప్రజాస్వామ్యానికి!

ఈనాడు తెలంగాణా సమరాన్ని గురించి ప్రతి దేశముఖూ, జానెడేసి పొడుగుటోపీలు తగిలించుకుని సమరవీరుడిలా నటిస్తున్నాడు. కాని, యీ సమరం సాగించిందీ, సాగిస్తున్నదీ వీళ్ళుమాత్రం కాదు. వీళ్ళు చేసిందల్లా — ప్రజల్లోంచీ వారి పోరాటాల్లోంచీ పారిపోయి, ఏ హైదరాబాదులోనో, విజయవాడలోనో కూచోడమే!

నిజంగా, తామె ముందునిలిచి తెలంగాణా సమరం సాగించిన వాళ్ళూ, విముక్త తెలంగాణా వీరభూముల్లో నూతన ప్రజాస్వామికం నెలకొల్పిన వాళ్లూ — వాళ్ళు తెలంగాణా ప్రజాకోటి — కార్మిక కర్షక కష్టజీవులు!

కాని, నైజాం నిరంకుశత్వానికి తెలంగాణా ప్రజానీకం బలి అయి పోతూంటె ఎన్నాళ్ళో చూస్తున్నటిదాకా నైజాంతో యథాస్థితి ఒడంబడికల దాగుడుమూతల్లో సరాగాలాడుతున్న మన భారతప్రభుత్వం, తీరా ఈనాడు విముక్త తెలంగాణాల్లో నూతన ప్రజాస్వామికం ఏర్పడేసరికి కంపరమెత్తి యుద్ధ సూచన పెడుతున్నది. విముక్త తెలంగాణా పరిసరాల్లో సైన్యాలను దింపుతున్నది. ఇక తెలంగాణా పోరాటాన్ని

చిత్రించే 'మాభూమి' వంటి నాటకప్రదర్శనాలను నిషేధించుతున్నది. తెలంగాణా వీరయోధుల్ని గజదొంగలుగా ప్రచారం చేస్తున్నది. భారతప్రభుత్వం ప్రకటించే, లేదా, ప్రకటించని యీ యుద్ధం యెవరి మీద? నైజాం నిరంకుశత్వం మీదనా, తెలంగాణా ప్రజానీకం నిర్మించుకున్న ప్రజాస్వామికం మీదనా ?

నూతన ప్రజాస్వామికం కోసం తెలంగాణా ప్రజలు సాగిస్తున్న చారిత్రాత్మకమైన సమరం ఒక్క-విశాలాంధ్రకే కాదు, యావద్భారతానికీ విప్లవకాంతులు విరజిమ్ముతున్నది. తెలంగాణా ప్రజాస్వామికాన్ని అరికట్టాలని చూసే ధనస్వాముల దూతలు కాలికింద నేల కదిలి తల క్రిందైపోతారు. ఒక్క- తెలంగాణాలోనే ఏమిటి, సమస్త భారతంలోనూ జనసామాన్యం నవజాగృతి పొందుతుంది ! వర్గరహిత సమాజనిర్మాణానికి పురోగమిస్తుంది !

ఈ మహా ప్రస్థానంలో రచయితలం, కళాకారులం తెలంగాణా ప్రజల పక్షాన, భారతప్రజల పక్షాన, నిలబడితీరుతామని శపథం చేస్తున్నాం.

******



కపాలాలతో నిర్మిస్తున్న
'నయా చార్మినార్'

శ్రీ పల్లా రామకోటయ్య

# కదలుమోయి, తెలుగుజోద!

కదలుమోయి, తెలుగుజోద !
కత్తిదూసి కదనమునకు
క్షణమైనను, ఆలసింప
జనదు—విపత్సమయమిది ॥కదలు॥

కొంపల నగ్నింటికి దోచు
కొనుచు — అగ్గిపాలుజేయు
నాజీ నైజాము భటుల
నాశన మొనరింప — వేగ ॥కదలు॥

చేజిక్కిన మానవతుల
జెరిచి, మరియు రక్కసులగు
కటిక రజాకార్ల తలలు
నరికి;— [illegible] ॥కదలు॥

పేరుగల్గు వా[illegible] స్త్రీల
బెట్టి — చిత్రహింస [illegible]యు
'దక్కను రక్షకులు' [illegible]
తల్లడిల్ల; — ప్రతిఘ[illegible] ॥కదలు॥

మతపాక్షిక పాలనమే
మనుగడయని — ఘోరహింస
దలపెట్టిన నైజామును
గెలిచి — పదభ్రష్టుజేయ ॥కదలు॥

సమీక్ష

# తెలంగాణా సమరసాహిత్యం

శ్రీ అనిశెట్టి సుబ్బారావు

## ప్రాతిపదిక:

రెండు ప్రపంచ సంగ్రామాలు జరిగాయి. కాని, భారత దేశంలో ఎన్నదగిన సంగ్రామ సాహిత్యం ఉత్పన్నంకాలేదు. గత మారణ సంగ్రామం మన సమాజంలో కలిగించినదుష్టఫలితాలను నిరూపిస్తూ కొంత సాహిత్యం సృజింపబడింది. ప్రపంచ మంతటినీ సుడిగుండంలో కీడ్చిన సంగ్రామం భారతదేశంలో రాజకీయ వికాసాన్ని పెంపొందించి ప్రజలందరినీ స్వాతంత్ర్య సమరోన్ముఖులను చేసింది. యూరప్, ఆసియాలలోని ప్రతిఘటనోద్యమాలు మనజాతికి మార్గదర్శకాలై స్వాతంత్ర్య సముపార్జనకు మార్గం చూపాయి.

మన యువకవులు ఆసియా ప్రజల స్వాతంత్ర్య పోరాటాలను, యూరప్‌లో గ్రీక్, యుగోస్లావ్ ప్రజల ప్రతిఘట నోద్యమాలను, స్టాలిన్ గ్రాడ్ వీరులు చూపిన శౌర్య సాహసాలను అభినందిస్తూ గీతాలు వ్రాశారు. గానం చేశారు. లక్షలాది ప్రజలు ఉత్తేజితులైనారు.

తెలుగుజాతికి ఒక సాంప్రదాయం ఒక విశిష్టమైన ఉపజ్ఞ వున్నాయి. అంతేకాదు. మానవులంతా ఏకకుటుంబమై ఒకే ఉత్తమాశయ సాధనకోసం మహత్తర త్యాగాలు చేస్తున్న ఈ రోజుల్లో ఒక అంతర్జాతీయ విప్లవ సాంప్రదాయం క్రమంగా రూపొందింది. భారతదేశంలో రవీంద్రుని ఉన్నత మానవత్వాన్ని, సుబ్రహ్మణ్య

భారతి అంతర్జాతీయ సౌభ్రాతృత్వాన్ని, మన ప్రజల కష్టసుఖాలను ప్రతిబింబించే జానపదగీతాల రచనాశిల్పంతో మేళవించి మన యువ రచయితలు ఒక నూత్న సాంప్రదాయాన్ని నిర్మించారు. తెలంగాణా స్వాతంత్ర్యసమరాన్ని చిత్రిస్తూ వెలువడిన రచనలకు ఈ సాంప్రదాయమే వరవడి దిద్దుతున్నది. అధునాతనరూపాలు పొందుతున్నది.

ఆంధ్ర ప్రజల నిత్యజీవితంలో పొడసూపే సమస్యలను చిత్రించాము. తెల్లదొరలపై సమర శంఖం పూరించిన నావికుల విప్లవాన్ని గానంచేశాము. స్పెయిన్, చైనా ప్రజలకు వెన్నుచరిచి అభివందనాలర్పించాము.

ఆంధ్రజాతికి జీవన్మరణ సమస్యయై, భారతదేశ ప్రగతికి మార్గం చూపుతున్న సోదర తెలంగాణా ప్రజల పోరాటాన్ని అభ్యుదయ రచయితలు కీర్తిస్తున్నారు. సందేశమిస్తున్నారు. ఒకేప్పుడు మన జాతి ఒవితాన్ని రూపించే సాహిత్యాన్ని పఠించి, మనగీతాలు మననంచేసి తెలంగాణా ప్రజలు ఉద్వేగం పొందారు. రాజకీయ వికాసాన్ని సంపాదించుకున్నారు. నేడు వారి అద్భుత ప్రతిఘటనోద్యమాన్ని, చైత్రయాత్రలను, అధునాతన ప్రజాస్వామ్య నిర్మాణాన్ని చూచి మనం అభినందిస్తున్నాము. తెలుగు జాతి భవిష్యత్తు వారిమీద ఆధారపడివుంది. అందుకని వారి జీవితాన్నుంచి మన కర్తవ్యాన్ని గ్రహిస్తున్నాము.

## నాటకం:

తెలంగాణా ప్రతిఘటనోద్యమాన్ని చిత్రించే సాహిత్యంలో ప్రధానమైనది **"మా భూమి"** నాటకం. ఆంధ్రప్రజానాట్యమండలి ఈ నాటక ప్రదర్శనలు ప్రారంభించగనే పట్టణాల్లో, పల్లెల్లో ఎక్కడికక్కడ దళాలేర్పడి అత్యంతోత్సాహంతో 'మాభూమి' ని ప్రదర్శించాయి. 'మన్నే వాసిదే భూమి' అనే ఉత్తమసత్యం ప్రజల మనస్సులలో గాఢంగా నాటుకుపోయి, నిరంకుశులకు వ్యతిరేకంగా భూమికోసం జరుపుతున్న తెలంగాణాప్రజల సమరాన్ని

ఆంధ్రప్రజలు హర్షించారు. 125 దళాలు మొత్తం 25 లక్షల ప్రజలకు 'మాభూమి' ని అందిచేయటం ప్రపంచ మంతటిలోనూ అరుదైన సంఘటన అని కె. ఎ. అబ్బాస్ అభినందించాడు.

ఒక ఉత్తమాదర్శం కోసం ప్రజల నాయత్తపరిచి, ఆ మహోద్యమంలో ఆంధ్రజాతి నైక్యం చేయగలిగిన నాటకం మరొకటి ఇంతవరకు రాలేదు.

నాటక రచనలోని శిల్ప నైపుణ్యాన్ని గురించి శ్రీ విశ్వనాధ సత్యనారాయణ ఇలా అన్నారు. "ఈనాటక రచన కొద్దిలో మిక్కిలి అందంగావుంది. ఇందులో అచ్చమైన తెలుగు జాతీయము కుప్పలు కుప్పలుగావుంది... మఱి లోకోక్తులు సందర్భోచితంగా బహు రమణీయంగా ఎన్నో ఉన్నవి..... ఒక కావ్యానికి ఆద్యంతాలు ఇంత చక్కగా బిగించడం ఒక శిల్పపు నేర్పు... ఈ నాటకంలో బహు గుణాలు వున్నవి... పాత్రపోషణ కమ్మచ్చున లాగినట్లున్నది...... మఱి దాదామొక్క పాత్రపోషణ సునిశితంగావుంది".

నైజాం ఆంధ్ర మహా సభ కార్యదర్శి శ్రీ రావినారాయణరెడ్డి నాటకంలో నిరూపించిన ఇతివృత్తాన్ని గూర్చి వ్రాస్తూ "తెలంగాణా జీవితాన్ని ఎంతో సహజంగా, సజీవంగా, చిత్రించుతోందని నా అనుభవాన్నిబట్టి చెప్పుతున్నాను" అని అభినందించారు.

"మా భూమి" గ్రంధకర్తలు శ్రీ సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కర రావులు "ముందడుగు," "అపనింద" మొదలైన నాటకాలు ఇంతకుముందే రచించి ఆంధ్రప్రజల మన్ననలు పొందారు. "మాభూమి" ని అభినందిస్తూ వ్రాయని పత్రికలు అరుదు. ఇందులోనికథ తెలియనివారు లేరు. కనుక కధనుగురించి నేను వేరే వ్యాఖ్యానించను.

ఆంధ్రజాతికి జీవన్మరణ సమస్యైన, ఆంధ్ర హృదయంలోని ఏకైక కాంక్షను ఘోషించే ఈనాటకం ఆంధ్రప్రజలకు ప్రేమాస్పదం కావటంలో ఆశ్చర్యంలేదు.

కాని, మద్రాసు ప్రభుత్వం ఈ నాటక ప్రదర్శనాన్ని మూర్ఖంగా నిషేధించి, తెలుగు జాతికి అపరాధం చేసే, ఆంధ్రులంతా ఏక కంఠంతో దీనినెదుర్కొనకపోవటం ఆశ్చర్యమే.

ఈ నాటకానికి ప్రస్తుత స్వాతంత్ర్యసమరం ఇచ్చిన ప్రాముఖ్యతేగాక, రచయితలకు తెలంగాణా జీవితంతో వున్న ఆ ప్రబాంధవ్యంగూడ ముఖ్య కారణం. "WEAVERS" అనే ఉత్తమ జర్మన్ నాటకం ఇది చదువుతున్నప్పుడల్లా నాకు జ్ఞాపకం వస్తుంది. ఇతివృత్తానికి ఏకాగ్రత కలిగించటంలోనూ, ముఖ్య పాత్రలకు పరిపూర్ణత నివ్వటంలోనూ, శ్రద్ధచూపితే ఈ నాటకం ఆంధ్ర సాహిత్యంలో శాశ్వత స్థానం సంపాదించుకునేది.

## నవల:

ఆంధ్రదేశంలో రంగస్థలం శిల్పందృష్ట్యా ప్రాథమిక దశలో వుంది. పాత్రల వైవిధ్యమూ, సన్నివేశాలలో క్లిష్టతలనుపరిపూర్ణతతో ప్రదర్శించటం పాత్రల సామర్థ్యం పైనే ఆధారపడుతుంది. ఇలాంటి దశలో నవలను ఉత్తమసాహిత్య కల్పనకు ప్రయోగించవలసి వస్తుంది.

ఒక సంగ్రామం జరుగుతున్నప్పుడు సాధారణంగా నవల ఉద్భవించదు. సంగ్రామం ముగిసిన తర్వాత, గత చరిత్రను గూర్చి నెమ్మదిగా పరిశీలించి ఆయా పరిస్థితులను గాఢంగా అనుభూతికి తెచ్చుకుని నవలను నిర్మించవలసి వస్తుంది. అందుకని ఒకపోరాటాన్ని ప్రోత్సహించవలసిన కర్తవ్యాన్ని నవలాకారుడు విస్మరించగలడా!

తెలంగాణా సమరాన్ని గురించి శ్రీ బొల్లిముంత శివరామకృష్ణయ్యగారు 'మృత్యుంజయులు' నవల రచించారు. ఆయన ఉత్సాహమూ, రచనాశక్తీ ఇందులో స్పష్టంగా విశదమౌతున్నాయి. తెలంగాణా ప్రజల జీవితంతో పరిచయ ముండడమేగాక, ఆ ప్రజల పోరాటం ఏ దుర్భర బానిసత్వాన్నుంచి, బాధలనుంచి ఉత్పన్నమైనదో గ్రహించటం వల్లనే ఇంత

చక్కని నవలను ఆయన రచించ గలిగారు. ప్రధానంగా, ఇది రాజకీయ నవల కావటంవల్ల, పాత్రల నిత్యజీవితాన్ని వివరంగా చిత్రించక పోవచ్చును. కాని, పోరాటం యొక్క ఉత్తమాశయాన్ని పాఠకునికి తెలియజేసి, ఆ ఆశయ సాధన కోసం అతి సామాన్యులైనవారు కూడా ఎంత మహత్తర త్యాగాలకు సిద్ధమౌతారో చూపించ గలిగారు.

ఈ నవలను గురించి ఆంధ్ర మహాసభ నాయకుడు శ్రీ రావి నారాయణరెడ్డిగారిలా అభినందించటానికి రచయిత చూపిన శక్తి నైపుణ్యాలే కారణం:

"జాగీర్దార్లు, దేశముఖులు, వతన్‌దార్లు, పెట్టుబడిదార్లు ప్రజల రక్తాన్ని పీల్చి పిప్పిచేస్తున్నారు. వెట్టిచాకిరి, అక్రమపన్నులు లంచాలు, అక్రమంగా భూముల ఆక్రమణ, తిట్లు, దెబ్బలు, హత్యలు, మానవతుల మానభంగాలు విరివిగా జరుగుతున్నాయి. రచయిత ఈ దౌర్జన్యాలనెన్నిటినో చక్కగా చిత్రించాడు. తెలంగాణా ప్రజలు ఈ దౌర్జన్యాలకు వ్యతిరేకంగా జరుపుతున్న వీరోచిత పోరాటాన్ని గూడ సజీవంగా చిత్రించాడు...అంతేగాదు రచయిత హైద్రాబాద్ ప్రజలకు ప్రజా ఉద్యమాలకు తన నవల ద్వారా ఒక సందేశాన్ని ఇస్తున్నాడు. ప్రభుత్వ తుది ఆయుధమైన మిలిటరీని ప్రతిఘటించుటకు నిరాయుధులైన ప్రజలు ప్రపంచమంతటా అవలంబించ వలసిన పోరాటవిధానాన్ని సూచించాడు. అదే 'గెరిల్లా' పోరాటం, నైజాం నిరంకుశ జాగీర్దారీ విధానాన్ని నాశనంచేయుటకు గెరిల్లాపోరాటం తప్ప వేరేమార్గం లేదనిచాటాడు.

"...హిందూ ముస్లిం సమస్యనుగూడ రచయిత చక్కగా చిత్రించాడు. నైజాం నవాబు హిందూ ముస్లిం ప్రజలకు సమాన శత్రువని నిరూపించాడు...

"నవలలో అక్కడక్కడ కొన్ని లోపాలుండవచ్చును. కాని నవలారచనయందు ఇది రచయిత యొక్క ప్రథమ కృషి యగుటచేత చాలా జయప్రదమైన ప్రయత్న

మని చెప్పుటయందు అతిశయోక్తి ఏమాత్రం లేదు..."

## కథలు :

సాహిత్యరూపాలన్నిటిలోనూ మన 'చిన్నకథ' అగ్రస్థానం వహిస్తుంది. పలువురు రచయితలు తమ అనుభవాలను, ఆదేశాలను వ్యక్తీకరించటానికి 'చిన్నకథ'ను ఎన్నుకుని, నిర్మాణంలోనూ, శైలిలోనూ ఆరూపాన్ని పరిణతికి తెచ్చారు.

సహజంగా తెలంగాణాసమరం గూడ కథలద్వారా చిత్రితమైంది. అనేకమంది "అభ్యుదయ" "ప్రజాశక్తి" పత్రికలలో కథలు ప్రచురించారు. శ్రీ పర్చా దుర్గాప్రసాదరావు 'గెలుపుమనదే' అనే కథల సంపుటిని ప్రకటించారుగూడ.

'మా భూమి' 'మృత్యుంజయులు' ప్రజల ప్రతిఘటనోద్యమాన్ని, వారి శౌర్యసాహసాలను మాత్రమే చిత్రించాయి. కాని, పోరాటం నూతనదశకు అధిగమించి ప్రజల జైత్రయాత్రలను, నూతనంగా స్వరూపం పొందుతున్న ప్రజాస్వామ్యాన్ని గూడ మన కథలు ఎత్తిచూపుతున్నాయి.

తండ్రి, కూతురి పెండ్లికోసం, అప్పుచేస్తాడు. అప్పుకు అనేకరెట్లు సొమ్ము ముట్టజెప్పినా చివరికి ఉన్న కాస్త భూమీ అప్పుకిందికే పోతుంది. కొడుకు, చెల్లెల్ని తిట్టుకుంటూ ఆంధ్రదేశంలోని ఒక పట్నంచేరి రిక్షాలాగి జీవిస్తాడు. పెండ్లి చేసుకోవాలనివుంది, కాని సోమతులేదు. రిక్షాలాగేవాడికి—పూర్వం ఎంత రైతైతేమాత్రం—పిల్లనెవరిస్తారు? దీనికంతటికీ చెల్లెలి పెండ్లి కారణం. కనుక ఆమెను తిట్టుకుంటాడు. అప్పుకు పదిరెట్లు డబ్బు హరించిగూడా, భూమిని కాజేసినవాణ్ణి అని ఏంప్రయోజనం? చెల్లెలి పెండ్లివల్లకదా అసలు అప్పు తెచ్చింది. కనుక తప్పు ఆమెదే!

ఒక రిక్షావాలా, రిక్షాఎక్కిన వానితో ఈ కథ చెపుతాడు. ఇతనికి తన భూమిని అపహరించడం అసాధారణంకాదనీ,అందరు పేదల భూముల్నీ, అందరు ధనవంతులూ ఏదో సాకుతో ఇలాగే హరిస్తారనీ గ్రహించే మానసికవికాసం

లేదు. పైగా ఒక ప్రత్యక్ష పోరాటం ద్వారా తమ భూములు తాము సంపాదించుకునే ఉద్యమం పెంపొందలేదు. అందుచేత గత్యంతరంలేక రిక్షావాలాగా తయారౌతాడు.

చిన్న రైతులు ఉన్న చారెడు భూమినీ కోల్పోయి ఎలా కూలీలుగా మారిపోతున్నారో చూపడానికి శ్రీ మహీధర రామమోహన్ ఈకథ రచించారు.

ఇది ప్రథమదశ మాత్రమే. రైతులకు క్రమంగా చైతన్యం కలుగుతుంది. ఈ దుష్టవిధానాన్ని నెలకొల్పి రక్షిస్తున్న ప్రభుత్వంతో రైతులు సహాయ నిరాకరణం చేస్తారు.

పండినా పండకపోయినా పన్నులు చెల్లించితీరాలి. తాము చెల్లించిన పన్నులతో తుపాకులు తయారుచేసి ప్రతిగా తుపాకి గుండ్లు ఇస్తుంది ప్రభుత్వం. కనుక పన్నులు చెల్లించటం మానేస్తారు. 'పన్నులియ్యవ్వం' అనే కథలో దీనినే శ్రీ పర్చా సర్వాప్రసాదరావు చిత్రించారు. కొత్త చైతన్యంతో ఉఱ్ఱూతలూగే రైతు తొలిసారి ఎలా ప్రవర్తిస్తాడో ఈకథ చక్కగా నిరూపిస్తుంది.

ప్రభుత్వం తన పటాలాలను పంపుతుంది. గ్రామాలను ధ్వంసం చెయ్యటమూ, స్త్రీల మానభంగాలు, దోపిళ్లు నిత్యకృత్యాలౌతాయి. రైతులు గ్రామాలను వదిలి గుట్టల్లో గుబురుల్లో తలదాచుకోవలసి వస్తుంది. నిలువనీడలేక, తిండిలేక రైతులు ప్రతిఘటనకు సిద్ధమౌతారు. నిరాయుధులైనా నిరుత్సాహపడరు. వడిసెలలు, కర్రలు, బరిసెలు సిద్ధంచేసుకుని, గెరిల్లా పద్ధతిలో పోరాడుతారు.

శ్రీ కొసరాజు శేషయ్య వ్రాసిన "బారికేడ్సు" కథ గెరిల్లాల ప్రతిఘటననే కాక, ప్రభుత్వబంట్లయిన రామయ్య వంటి భూస్వాముల ప్రవర్తనను గూడ వివరిస్తుంది. పెద్దవాడైన రామయ్య స్వార్థంతో ప్రజలను వ్యతిరేకిస్తే, కొడుకు కూతురు గెరిల్లాలతోపాటు నిలిచి తమ ధర్మాన్ని నిర్వర్తిస్తారు. నేటికుటుం

బాలలలో పెద్దలకూ పిన్నలకూ మధ్య వున్న అంతరాన్ని ఈ కథ బాగా వెల్లడిస్తుంది. బారికేడ్ల వద్ద ఆగిపోయిన పోలీసులు నిస్సహాయులయ్యేవరకూ ఎవరు చూస్తున్న గెరిల్లాలు తాము సాహసంతో ఎదుర్కొనే అవసరం లేకుండానే విజయంపొందుతారు.

తమ స్త్రీలు అవమానం పొందటమూ, తమ గ్రామాలు దహనమైపోవటమూ ప్రజలందరిలో ఒక పవిత్రక్రోధాగ్నిని రగుల్కొల్పుతుంది. పగయే ఎంతటి ధైర్యాన్నైనా ఇచ్చి రజాకార్ గుండాలను, నైజాం పోలీసులను సంహరింపచేస్తుంది. శ్రీ తెన్నేటి సూరి "సంధిలేదు" అనేకథలో ఈ సత్యాన్నే నిరూపించారు. తెలంగాణా పోరాటంగూర్చి వెలువడిన కథలలో ఇది ముఖ్యమైనది. ఈయన "నైజాం రాజబంధువు" గూడ ఎన్నదగిన కథ.

ఈ స్వాతంత్ర్య సమరంలో స్త్రీలు అద్భుతంగా పోరాడుతున్నారు. స్త్రీమీద గౌరవంలేని ఏ ప్రభుత్వం ఏకాలంలో మనగలిగింది! ఈ సమయంలో స్త్రీల అసమాన సాహసాన్ని చిత్రిస్తూ అనేక కథలువచ్చాయి. "మీరు గెలుస్తారు" అనేకథలో యువతులు పోలీసు ముష్కరులను ఎంత సాహసంతో ప్రతిఘటిస్తున్నారో శ్రీ తుమ్మల వెంకటరామయ్య నిరూపించారు. శ్రీ పర్చా దుర్గా ప్రసాదరావు 'యెంకాం'అనే అనాగరిక స్త్రీ గెరిల్లాలను పసిబట్టడానికిఊరి వెలుపల కాపలావుండి, పోలీసులకు దొరికిపోయినప్పటికీ వీరోచితంగా ఎదుర్కొన్న సంఘటనను "వడిశాల" అనే కథగావ్రాశారు. యువతులే గాదు, అమాయకులైన వృద్ధస్త్రీలుగూడ తమగొడ్డు గోదలను దేశముఖు గుంజుకుపోతే వ్యధపడి, చివరికి ప్రజాప్రభుత్వం తమ కర్రావులను, కోడెదూడలతోసహా తిరిగియిస్తే అపారమైన సంతోషమూ, దేశముఖుపై ఆగ్రహమూ ఎలా వెలిబుచ్చుతారో శ్రీ పిచ్చేశ్వరరావు "విముక్తి" అనే కథలో ఉత్తమంగా చిత్రించారు. స్త్రీలపాత్రను గురించేపగ

(మిగతా 39 వ పేజీలో)



## అహంకారానికి ప్రతీకారం

ఎన్నని జ్ఞాపకం చేసుకుంటాడు. తన మేనత్త సంగతి ఏమిటి? ఊరూ కాదూ కోసి...! ఈ దేశముఖు ఒకటిచేసి ఒకటి చెయ్యలేదా? తన తాతలనాటి భూముల్లో ఇప్పుడు సగమన్నా లేవుగదా? ఏమైపోయినై? దేశముఖు కివ్వవలసిన నజరానాల .కోసం వాడిదగ్గిరే అప్పుచెయ్యడం, మళ్లీ వడ్డీలకు కట్టుకోలేక భూములన్నీ వాడికే కట్టబెట్టడం! ఈమాట తలచుకుని తలచుకుని రాంరెడ్డి ఎంత కుంగిపోతుంటే వాడో తనకు తెలుసు.

అసలు తనొక్కడనే ఏమిటి? వాడి నుండి ఊళ్లో ఎవడు తప్పించుకున్నాడుకనక.

వెంటనే "అట్లాగా" అని రామిరెడ్డి అందుకుంటాడని చూశాడు పట్వారీ. అతని ముఖంమీద ఏవో నీడలు కదులాడు తున్నట్టు చూసి కొంత సందేహించక తప్పిందికాదు.

"ఏమో రామిరెడ్డీ, సాజెంటుగూడా వస్తాడంట. బహు గొడ్డదొరలే యేటు దెప్పించకపోతే బాగుంటుందా? వెంకట్టి పిలిపిస్తా" నన్నాడు పట్వారీ చొరవచేసి.

ఈ చొరవతో రామిరెడ్డి హృదయం చురుక్కు మన్నది. అప్రస్తుతాల్లోంచి ప్రస్తుతంలో పడ్డాడు.

"అసలు పోలీసోళ్లెంది, మామా, కమ్యూనిస్టులు తంతావుంటే, సాగిపో యొస్తా వుంటారాయేంది మనూరు?" అని అప్రయత్నంగానే అడిగాడు రామిరెడ్డి.

"పోలీసులు రాకపోవటమేంటి? వాళ్లు లేకుంటే ఒక్కకొంప దక్కుతుందా? అరాచకం అయిపోదూ?"

కొంత దీనంగానూ కొంత తెగింపు గానూ మాట్లాడుతున్నాడు పట్వారీ.

"వాళ్లే వెళ్లగిస్తున్నారంటలే. మాకెం దుకు? మాకొంపకెక్కట్లేను." అని ముఖం పక్కకుతిప్పి, బొడ్లో పొగాకు కాడ పైకి లాగి ఒక్క చివరింపు చివరించి, దాన్ని నవరిస్తూ, అట్లే చూస్తున్నాడు రామిరెడ్డి; తనచుట్టూ ఎవ్వరూ లేనట్టుగానే.

"అయినగానికీ కానిగానికీ ఈగడేసా ఆగడేసా ఎక్కువాళ్లేకాదు. సరేలే - వెళ్లొస్తా"నని వెళ్లిపోతగా పట్వారీ చెప్పిన మాటలుకూడా ఆతను వినిపించుకొని వుండడు.

**2**

పోలీసులు ఊళ్లోకి రాలేదుకాని, ఊరంతా కలకలంగానే వుంది. చుట్టుపట్ల గ్రామాలన్నిట్లోంచీ రైతులు ఎత్తేసుకుని పోలీసులు పట్నానికి పారిపోతున్నారని అందరికీ తెలిసిపోయింది. పక్కవూళ్లో స్వరాజ్యం వచ్చేసిందట - దేశముఖు కాజేసిన భూములన్నీ ఎవళ్లవాళ్లకు ఇచ్చేస్తున్నారంట కమ్యూనిస్టులు, భూములే కాదు, గడీలోవున్న గొడ్డుగోదల్నికూడా, వ్యవసాయం చేసుకోమని, లేనివాళ్లకిచ్చేస్తున్నారంట; పటేళ్లు పట్వారీలు మళ్లీ కనపడకుండా పోయారంట; ఒక్క తగాదా లేకుండా జనమంతా కలిసి ట్టుగా ఉన్నారంట...ఆనోటా ఆనోటా ఈ అద్భుతాలు ఊరంటా కమ్ముకున్నాయి.

ఇట్లాంటి సంగతులు జరుగుతాయని వాళ్లు కలలోకూడా అనుకోని ఎరుగరు. ఇప్పుడు సమగుకూరంలో ఇట్లాంటివి జరగటంచూస్తే, ఒక్కొక్కళ్ళలోనూ అంతు లేని ఆందోళన బయలుదేరింది. ఏదో ఆశ

"ఈ గ్రామం నాది. ఇక్కడ నా మాట సాగి తీరాలిసిందే. ఎవ్వడూ యెదురుచెప్పడానికి వీల్లేదు. ఈ ఊళ్లో ప్రతిఒక్కడూ ప్రతిఒక్కతే సంఘంలో చేరి తీరాలి! ఇది సంఘం ఊరు!!" పట్టిపట్టిఅంటున్న ఆ ప్రతిఅక్షరంలోనూ అతని హుంకాతనంతో పాటు హృదయం కూడా తొంగిచూస్తూ, అతని అనుజ్ఞకోసంలా ఎదురుచూస్తున్న జనసామాన్యంలో కొత్త శక్తినీ ఉత్సాహాన్నీ రేకెత్తించింది.

"జై ఆంధ్రమహాసభకూ జై!"

ఆకాశం తోడు పలుకుతున్నది.

## 3

రచ్చబండదగ్గిర, ఊరంతా, ఏకమైంది. పక్కవూళ్ళ సంగతులన్నీ ఏకరువు పెట్టేస్తున్నాడు వీరప్ప పెద్ద పెత్తందారులాగా. అసలు యీ గొల్లవాడు ఎన్నడన్నా ఇన్ని గుండెలతో ఇక్కడ నిలబడి ఎరుగునా? రామిరెడ్డికి ఇది ఆశ్చర్యంగానే వుంది. కాని, వాడే తనకి తెలీని సంగతులు చాలా చెబుతున్నాడు.

దేశముఖు కాజేసిన రైత్వారీ భూములన్నీ ఆయా రైతులకు మళ్లీ ఇచ్చేస్తారు. గడీకి తోలుకుపోయిన గొడ్లను తిరిగి ఎవళ్లవి వాళ్లకు ఇప్పించారు. రెడ్డీ, కాపూ, మాలా, మాదిగా తేడా లేకుండా అంతా ఒక్కటిగా వుంటున్నారు.

వీరప్ప చెప్పే సంగతులు రామిరెడ్డికి ఆటే అంతు పట్టడం లేదు. కాని, అతని మనస్సు ద్వంద్వాతీతంగా వుంది — అతనికి ఇష్టమూ అయిష్టమూ అంటూ లేవు ఈ ఊరు తనది; ఇక్కడ ప్రతి ఒక్కడూ తను చెప్పినట్టు నడుచుకోవాలి. అంతే.

గోపాలరావు చిన్నవాడే కాని, దేశముఖు ఎవరెవరి భూములు ఎంతెంత ఆక్రమించాడో, వరసనే లెక్కలు చెబుతున్నాడు. గొడ్డు గోదల సంగతి వీరప్ప చెప్పేశాడు. దేశముఖు మనుషులొచ్చి ఎవళ్ళవళ్ళ ఇళ్ళల్లో కోళ్లు కొట్టుకుపోయారో ఒక్కొక్కరే చెప్పుకుంటున్నారు. ఒకమ్మ తన పరాభవాన్ని చెప్పుకొంటూ, గొంతు తడి ఆరిపోయి, కళ్ళనీళ్ళు పెట్టుకుని నేలచూస్తూ నిలబడి పోయింది. మరోతల్లి, దేశముఖు గూండాలు తనబిడ్డ గుండెల్లో దిగేసిన గడ్డపలుగు కళ్ళల్లో మెదులుతూ నోట మాట రాకుండా కూలబడిపోయింది. నోరూ, మొహం వ్యక్తంచెయ్యలేని అనేకదుఃఖాలు అనేకులవి ఒక్కొక్కరికీ తమతమ అనుభూతులే వ్యక్తపరుస్తున్నాయి. అందరిదీ ఒకటే దుఃఖం; అందరి దుఃఖం ఒకటే.

"ఇంక ఈ వూళ్ళో ఇట్లాంటి దురాగతాలు జరగనివ్వను. దేశముఖు మనుషులూ పోలీసులూ ఈ వూళ్ళో అడుగుపెట్టడానికి వీల్లేదు!" అని రామిరెడ్డి గర్జించాడు. నైజాం నిరంకుశత్వం నశించాలనీ, ధనవంతుల పెత్తనం పోవాలనీ అందరూ ఒక్కపెట్టున అరిచారు.

క్షణంలో మళ్ళీ ఒక్కొక్కరే మొదటి చర్చల్లోకి వచ్చేసారు. దేశముఖు లాక్కున్న భూములూ, గొడ్డూ గోదా, ఎవళ్ళవి వాళ్ళ కిచ్చెయ్యాలి. వాడివల్ల నష్టపడ్డవాళ్ళ కందరికీ పరిహారం ఇవ్వాలి. వాడి స్వంతకమతాలు మినహాయించి కవుళ్ళకిచ్చిన భూములన్నీ కవులుదార్లకే

చెందాలి—అయితే వాడికి న్యాయమైన కవులు ధాన్యం చెల్లిస్తారు. అంటే వెనకటి లాగా వెళ్ళాం నల్లపూసలమ్మి కాదు; పండిన పంటలో వాడికి న్యాయమైనంత మాత్రమే యివ్వాలి.

అంతా సై అంటే సై అన్నారు. అంతా బాగానే వుంది. కాని యిదన్నీ ఎవరు చెయ్యాలి? వీరభద్రప్ప చెప్పాడు—పక్కవూళ్ళో పంచాయితీ పెట్టుకున్నారట.

ఇట్లాంటివన్నీ వీరప్పకు బాగా తెలుసునల్లే వుంది. పంచాయితీలో వీరప్పగుండాలన్నాడు రామిరెడ్డి. ఎవ్వరికీ ఆక్షేపణ వున్నట్టు కనిపించలేదు. గోపాలరావు పేరు సూచించారు కొందరు. బస్తీలో చదువుకుంటూ సెలవలకి వూళ్ళోకి వచ్చిన సీతమ్మ గోపాలరావు చెల్లెలు "నేనుకూడా వుంటాను" అని లేచింది. ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. రామిరెడ్డికిదేమో విడ్డూరంగా తోచింది గావును— "ఆడవాళ్లు మీరు దేనికి లేమ్మా, మేం వున్నాంగా" అన్నాడు. "పంచాయితీలో ఆడంగులు కూడా వుండాలిసిందే" అని పక్కవూరి సంగతి ఎత్తుకున్నాడు వీరప్ప. రామిరెడ్డి మరి మాట్లాడలేదు; పేచీ తీసేసుకున్నట్టుగా "అయితే సరే" అని తేల్చాడు. "సీతమ్మక్కకీ జై" అన్న పుల్లి కేక ఈలలాగా మోత పెట్టింది. అదో అయోమయంగా చూస్తూ కూడా అరుగు మీద కూచున్న రంగమ్మ మొహం ఎందుకో మెరిసింది.

పంచాయితీ నాల్గింటా ఇట్లాగే ఎన్నికైనారు. ఊరంతా తన మాటమీద నడిచితీరాలని గొంతు సవరించుకొంటూ పొరగా దగ్గాడు రామిరెడ్డి. "మీరు కవుళ్లకిచ్చారుగదా పొలాలు వాటి మాటేమిటి?" అని సీతమ్మ కొంత తెంపుగానే అడిగింది. జనంలో కొంచెంగా అలజడి కలిగింది. అసలు రామిరెడ్డంటే ఆందరికీ ఎంతో కొంత భయం వుంది; భక్తీ వుంది. అదీగాక, ఇప్పుడు... దబ్బున ఆయన కూడా తమతో పాటు ఉండడం ఒకటీ...

అతను ఎన్నడూ ఎదురు వాదాలను సహించే మనిషి కాదు; ఎక్కడలేని అభిమానం పుట్టుకొస్తుంది.

"వెధవది నా పొలం మాటేంది? దేముడి పొలమైనా అంతే! రామాయణమంతా విని రాముడికి సీతేం కావాలన్నాడంట. ఇందాకట్నుంచీ చెప్పిందంతా యేమైపోయింది?" అని సీతమ్మను చివాట్లు పెట్టేంత పని చేసాడు; ఈ పంచాయితీకి ప్రెసిడెంటుగా వుండి తనేగదా, గ్రామాన్ని నడిపించాలిసింది!

జనంలో అలజడి పోయి ఒక్కసారి ఆనందం వెల్లివిరిసినట్లయింది. తోచనట్టు ఆలోచనగా రంగమ్మ అరుగుమీద బెత్తికలు ఒలుస్తున్నది. పుల్లి కంళ్లనిండా ఏదో అద్భుతం తొణికిసలాడుతున్నది. అంతా తనే అయ్యా, తనదంటూ ఏమీ లేనట్లుగా, గర్వంగా చూస్తున్నాడు రామిరెడ్డి.

"ఎవళ్ల భూములు వాళ్లకిచ్చేస్తున్నాను. పోయి దున్నుకోండి!" అని వీరప్పవంక చూచి "ఒరేయ్ వీరప్పా..." అని ఇంకా యేమో చెప్పబోతున్నాడు రామిరెడ్డి.

సంఘం వూళ్ళో తక్కువకులాలవాళ్ళు గదా అని, ఒరే అరే అంటానికి వీల్లేదని తప్పుపట్టాడు గోపాలరావు "మరేం తప్పు లేదు లెండి, అరికేం పెద్దోరు" అన్నాడు వీరప్ప.

"కాదగ్రో, అలవాటు చొప్పున అనే శాను. ఏమనేగాని వీరప్పా, నువ్వు వెడి కెల్లి యువళ్ళ గొడ్డుగోదల్ని ఆళ్ళ కిచ్చే సెయ్యి" అని రామిరెడ్డి హుకుం జారీ చేశాడు. కోళముఖు ఎవళ్ళెవళ్ల కెంత నష్ట పరిహారం యివ్వాలో తేల్చుకున్నారు గోపాలరావూ. ఆడవాళ్ళ కష్టసుఖాలూ నుంచి చెప్పేటా సీతమ్మ కొప్పజెప్పారు. పొలాలకెళ్ళేవాళ్లకు పొద్దెక్కుతున్నదని తక్కిన సంగతులన్నీ రాత్రికి వాయిదా వేసి గొండిన్ని సాగరుకాడ తీసి తాపీగా చుట్టుముట్టుకుంటూ తెచ్చారు.

పొద్దుపొడిచిందో లేదో, రజాకార్లూ, పోలీసులూ వస్తున్నారని ఊరంతా పొక్కి పోయింది ఎవళ్ళకు వాళ్ళు మూటాముల్లే కట్టుకొని పొలాల్లోకి వెళ్ళిపోతున్నారు. ఒకళ్ళ సంగతి ఒకళ్ళకు తెలీకుండావుంది.

వీరప్ప వచ్చి చెప్పేదాకా రామిరెడ్డి కేమీ తెలీదు—దొడ్లో గొడ్లకాడ బాగు చేయిస్తున్నాడు అంతా పారిపోతున్నా రంటే, అతనికి తేళ్ళూ జెర్రులూ పాకి నట్టయింది.

"ఇక్కణ్ణుంచి బయటిక వెళ్ళటానికి విల్లేదు. రజాకార్లురానీ, వాళ్ళ బాబులు రానీ ఈ ఊళ్ళో అడుగు పెట్టనివ్వను!" అని రామిరెడ్డి ఒక్క దూకులో వీధిలోకొచ్చే సాడు.

నడవలేక ఏడుస్తున్న పిల్లల్ని పడేసి ఈడ్చుకుంటూ, మొయ్యలేని బరువుల్తో యెక్కడికో వెళ్లిపోతున్నారు తల్లులు కర్రమోపుమీద శరీరం కదిలించు కుంటూ, యింకా ప్రాణంమీద కడపటి ఆశలతో పడుతూ లేస్తూ పోతున్నారు. ముసలీ ముతకా యువకులు ఒక్కళ్ళూ కనిపించకపోయేసరికి రామిరెడ్డి మనస్సు చివుక్కుమంది. ఊళ్లో తనూ, తనతో పాటు వీరప్పా మిగిలిట్టున్నారు

ఏమైనా, అతనిగుండె చెదరదు అతని రక్తంలోనే పిరికితనంలేదు.

"పద! వీరప్పా. పదు! మనం ఇద్దరం చాలు!" అని దడదడా నడిచిపోతు న్నాడు ఊరిమొదవున్న తన డాబా వైపు.

వీరప్ప యేదో చెబుదామని చూస్తు న్నాడు; ధైర్యం చాలడంలేదు. కూడా నడవడం తప్పితే అతను చెయ్యగలిగిం దేమీ లేదు.

గబగబా లోపలికెళ్ళి తుపాకి తీసు కొచ్చి, "ఇది నాకు మొగాళ్ని కాల్చ టాని కిచ్చారు. చూసుకో. యిప్పుడీ మొగాళ్ని కాల్చి పారదూస్తా!" నని తలెత్తేసరికి రామిరెడ్డికి యెదురుగా పాతిక మంది యువకులు నిల్చొని వున్నారు. అత నికి అమాంతం తామసంవచ్చేసింది: "ఇంతా కణ్ణించి యీడ వచ్చారంట్రా?" అని ఒక పెద్ద బొలికేక పెట్టాడు.

గోపాలరావూ సీతమ్మా ఆ యువకు ల్లోంచి ముందుకొచ్చారు. ఊళ్లో స్త్రీలనీ పిల్లల్నీ అందర్నీ సద్ది పొలాల్లోకీ గుట్టల్లోకీ పంపించి వైనం చెబుతున్నాడు గోపాల రావు. (మిగతా 34 వ పేజీలో)

# కాంగ్రెజా? అంగ్రేజా?

సుంకర సత్యనారాయణ

★

## నాటిక

[మధ్యాహ్నం: నైజాం సరిహద్దు మీది యూనియన్ గ్రామంలో స్టేట్ కాంగ్రెసు వారి శిబిరం. ఆఫీసు గదిలో ఒక డ్రాయర్, బెంచి, రెండు కుర్చీలు ఉంటాయి. డ్రాయర్ మీద తెల్లటి ఖద్దరువస్త్రం పరచి ఉంటుంది. దానిమీద కలం, సిరాబుడ్డి, తెల్లకాగితాలు, నాలుగైదు గాంధి టోపీలు ఉంటాయి.

కాంతారావు వయస్సు 35 సంవత్సరాలు. చిన్న మీసం. తెల్లటి ఖద్దరుధోవతీ, లాల్చీ ధరించి ఉంటాడు. బిళ్ళగోచీ పెడుతాడు. తల మీద గాంధీటోపీ ఉంటుంది.

పట్వారీ వయస్సు 40 సంవత్సరాలు; నూతన ఖద్దరు వస్త్రాలు ధరించి ఉంటాడు. మీసాలు ఉండవు. మనిషి బొద్దుగా ఉంటాడు. కొద్దిగా పొట్ట. చామన చాయ. పైజామా, సిల్కు-షర్టు, షేర్వానీ బెంచిమీద ఒకమూల ఉంటాయి.

శిబిరాధిపతి కాంతారావు, పట్వారీ కేశవరావు దోసిలిలో తీర్థము పోస్తాడు. కేశవరావు తీర్థం పుచ్చుకొని ఆ చేతులతో తల నిమురుకుంటూ ఉంటాడు. తెర లేస్తుంది.

శిబిరాధిపతి ఒక గాంధీటోపీని తీసి పట్వారీకి అందించుతాడు.]

కేశ: (టోపీని తలకు పెట్టుకొంటూ) ఎవరు ఎటువంటివారో, వారిని ఎలా గౌరవించాలో తమలాంటి మహానుభావులకు తెలుస్తుంది. అంతేగాని...

కాంతా: (నవ్వుతూ) అవును, ఎదుటి మనిషి హోదానూ, సమర్థతనూ, గుర్తించలేని వెధవలు, దేశాన్ని ఏం ఉద్ధరిస్తారండీ, కేశవరావుగారూ!

కేశ: అదేమిటండీ; అసలు ఉద్ధరించేదే వాళ్లటగా. ప్రజారాజ్యం నెలకొల్పుతారటగా.

కేశ: (హరి వైపు తీవ్రంగా చూస్తూ ఉంటాడు.)

కాంతా: కుర్రవాడు తెలిసి వకటి తెలియక వకటి మాట్లాడుతూ ఉంటాడు.

కేశ: (తలపంకిస్తూ) కాంగ్రెసులో...

కాంతా: కాంగ్రెసు అంటే ఇతనికి విపరీతమైన భక్తి. నేనంటేఎంతో విశ్వాసం.

కేశ: అలాగా! ఎందుకుండదు గురి. మీరు శిబిరాధిపతులు. అందులో ఇలాంటి కుర్రవాళ్ళను ఎందరినో సంస్కరించి బాగుచేశారు.

(హరి ప్రవేశం.)

కాంతా: ఆc, మనదేముంది. అదంతా మహాత్ముని చలవ. (హరివైపు చూచి) హరీ! పేపరు రాలేదా?

హరి: అసలు యింకా కుంపాయే రాలా.

కాంతా: (చేతిగడియారం చూచుకుంటూ) ఒంటిగంట అయిందే. ఎందుకని అబ్బా.

హరి: (బల్లమీద గుడ్డలవైపు చూచి) ఈ విదేశీగుడ్డలు మన శిబిరంలో ఎందుకు? తగలబెడతా.

(వాటిదగ్గరకు పోతాడు.)

కేశ: (కాంతారావు వైపు చూచి) ఆషేర్వానీవక్కటే రెండువందలైంది!

హరి: పనికిరానివి ఎన్ని వందలు అయితే ఏం. "మైలగుడ్డలను యికనుంచి ధరించ"మని, శపథం చేశారుగా మీరు.

(పట్వారీ కాంతారావు వైపు చూస్తాడు.)

కాంతా: ప్రస్తుతం వాటిని దాచి పెట్టు హరీ! ఎందుకైనా మంచిది.

కేశ: నేను భద్రం చేస్తానులెండి. (ఆ బట్టలను చుట్టచుట్టి పట్టుకుంటాడు.)

హరి: చేయండి. స్వతంత్ర స్వారాజ్యంలో మ్యూజియంలోనికి పనికివస్తాయి.

కాంతా: కాలు క్రింద పెట్టని భోగి, నేటికి ఇక్కడికి నడిచిరావలసిన యోగం పట్టింది. కాస్త విశ్రాంతి తీసుకుందురు. లోపలికి తీసుకువెళ్లు హరీ. (పట్వారీవైపు తిరిగి) పదండి.

కేశ: చిత్తం. (హరితోపాటు లోనికి వెళతాడు. కాంతారావు కుర్చీలో కూర్చొని యేదో వ్రాసుకుంటూ వుంటాడు. హరిప్రవేశం)

హరి: ఏమిటి రాస్తున్నారు?

కాంతా: పేపరుకు స్టేటుమెంటు.

హరి: ఏమిటది?

కాంతా: "కాంగ్రెసువారిమీద కమ్యూనిస్టులదాడి" అని.

హరి: అదెక్కడ?

కాంతా: ఇక్కడే.

హరి: ఇక్కడా! ఇక్కడ ఎవరిమీద?

కాంతా: మనం గౌరవ మిచ్చిన కేశవరావుగారిమీద.

హరి: ఆయన కాంగ్రెసా?

కాంతా: అవును, ఎందుకు కాకూడదు. ఆయన మనిషి కాదా?

హరి: కాదు, ప్రజలరక్తం త్రాగే రాక్షసుడు.

కాంతా: ఎప్పుడో, ఏమో!

హరి: ఇప్పుడు కాదంటారు?

కాంతా: అవును.

కాంతా : గొల్లెలనుంచి. వాళ్ళంకే తెలుసు, అవకాశంచూచి, నేను ఒక్కమాటింగు వేశానా అంటే వాళ్ళ బుర్రలు గిర్రున తిరిగిపోవు? (వెలుపలనుండి "కాంతారావుగారూ" అని కేక వినబడుతుంది)

హరి : ఆఁ వస్తున్నా. (అంటూ వెళ్లి పేపరు, నాలుగు ఉత్తరాలు, తీసుకొని పేపరు రాపర్ ఊడదీసుకుంటూ ప్రవేశిస్తాడు)

కాంతా : పేపరు వచ్చిందా, ఏదీ? (హరి పేపరు అందించి ఉత్తరాలు బల్లమీద పెడతాడు. కాంతరావు తొందరతొందరగా హెడ్డింగులు చూస్తుంటాడు.)

హరి : వార్తలేమిటి?

కాంతా : రజాకార్ల వేషాలతో కమ్యూనిస్టుల దోపిళ్లు. (పేపరుమీద చిటికె వేస్తూ) బాక్సు కట్టి మరీ వేశాడు. రజాకార్ల వేషాలతో కమ్యూనిస్టుల దోపిళ్లు, దోపిళ్లు.

(పెడరెక్కలు గట్టిన ఒక మనిషితో ఇద్దరు రైతులు ప్రవేశం. ఆ మనిషికి గడ్డం, మీసాలు ఉంటాయి. అతడు ముస్లిం దుస్తులతో ఉంటాడు. రైతులలో ఒకరి వయస్సు 40; పేరు కొండయ్య. రెండవవాని వయస్సు 30; పేరు గోపయ్య. ఇద్దరూ మడిగోచీలు పెట్టుకొని, తలగుడ్డలు చుట్టుకొని ఉంటారు. కొండయ్యకు చొక్కా ఉండదు. గోపయ్య కురుచ చేతుల చొక్కా తొడుక్కున్నాడు. ఇద్దరి దగ్గర కర్రలుంటాయి.)

రైతులు : నడవరా, గాడిదకొడకా నడువ్.

(అంటూ ఆ బందీని మెడబట్టి నెట్టుతారు. వాడు స్టేజీ మధ్యకు వచ్చిపడి, వెంటనే లేచి గడగడ లాడుతూ నిలబడతాడు.)

కాంతా : (ఆశ్చర్యంగా) ఏమిటిది! వీడెవడు?

గోప : పచ్చి దొంగ!

కొండ : చూడండి. దున్న రొప్పినట్టు రొప్పుతున్నాడు.

కాంతా : ఏం చేశాడువీడు? హరీ! మంచి నీళ్లు. (హరిలోనికి వెళతాడు.)

కొండ : అడక్కండి. వాణ్ణే.

గోప : మాట్లాడవేరా గాడిదకొడకా. (అని దొంగ నెత్తిమీద కొడతాడు.)

కాంతా : (విసుగుగా) వాడే చెప్పాలా? మీరు చెప్పకూడదు!

కొండ : పొద్దున ఈ నాయాలూ, ఇంకా నలుగురూ వచ్చి మావూరుమీద పడాలి అని చూసిన్రు.

కాంతా : పట్టపగలే!

గోప : చేతుల్లో తుపాకులుండైగా. వాటిని చూసుకుని కొవ్వు పస్లెక్కినై నాయాళ్ళకి.

కాంతా : ఊఁ తరువాత.

కొండ : ఊళ్లో చొరబడటానికి గుండె సాలక పెడగావుండమ పిన్ని ఇట్లో పడ్డరు.

కాంత : (ఆవేశంతో) ఊఁ పది...

కాంతా : మిమ్మల్ని కాదయ్యా, నేను అన్నది. (అంటూ రామారావు కట్లు ఊడదీసి అతనిని లోనికి పొమ్మని సైగ చేస్తాడు.)

కొండ : మరెవర్నంది?

కాంతా : అది వేరేవిషయం. మీకు తెలియదు.

గోప : తెలిస్తే ఈ దొంగ నాయాల్ని యీడకి యెందుకుతీసుకొస్తాం.

కాంతా : ఏయ్, అబ్బాయ్, శాస్త్రమర్యాదగా మాట్లాడాలి.

కొండ : సరేవున్నమా, పాడాకు న్యాయ తెలవటానికి.

గోప : (కొండయ్యవైపు మరమర చూస్తూ) "ఆడకి తీసుకెత్తే అంతా కాంతారావుగారే తేలుస్తారంటిరిగా.

కాంతా : తేల్చే పంపిస్తాను. తొందర పడతారేం.

గోప : తేలిపోతే ఏంటి ఇది. తనవాడు అయితే దొంగను తేలుకట్టినట్టు ఊరుకుంటమా! ఎవడో అయితే ఉరా! ఏం న్యాయం!

(పట్వారీ ప్రవేశం రైతులిద్దరు అతనివంక ఆశ్చర్యంగా చూస్తూ వుంటారు.)

కాంతా : ఏమిటి ఆయనవంక అలా చూస్తున్నారు?

గోప : ఈ పోలీసు మోకలోడు, ఈడకి ఎట్టా జేరిండా అని.

కాంతా : (నవ్వుతూ) కాంగ్రెసులోవున్న గొప్పదనమే అది!

కొండ : ఏంది! యిట్టాంటివాంకను జేర నీయటమా!

కాంతా : ఇదిగాదు హృదయపరివర్తన కలిగించి, వారిని సరియైనదారికి తీసుకు రావడం. (హరి ప్రవేశం)

కొండ : అంటే

హరి : అంటే మనస్సు మార్చి మంచిదారికి తీసుకురావడమన్నమాట.

గోప : (ఆశ్చర్యంగా) ఏంటి? యీయన మనసా! ఊరికి ఉత్తగాన చేరినాడే మారేది.

కొండ : అమ్మపుట్టిల్లు మేనమామకు తెలవకుండా ఉంటుందా! ఈయన మా వూరు పట్వారీయేగా.

కేశ : అదిగాదు కొండయ్యా? మహాను భావులు, కాంతారావుగారి చేతితీర్థము అందుకున్నారు. నాకు మైకం విడింది. దారి దొరికింది.

కొండ : అయితే ఇంకేం. మీకు దారి. మాకు గోదారి.

హరి : అదేమిటి? ఎందుకని

కొండ : ఏం ఉంది. ఆయనికి దారిదొరకడం అంటే మమ్మల్ని గోదారికి యీడవటానికేగా.

కేశ : మీరు పొరపడుతున్నారు.

కొండ : పొరపాట్లో గాపాట్లో. యీ గొడవ మా కెందుకు (కాంతారావు వైపు చూచి) కాంతారావుగారూ! ఇంతకీ మా మాట ఏంటి?

కాంతా : అంతా సరిజేస్తాను. ఇంతకీమీరు అనేది ఏమిటి? మా రామారావు దొంగతనం చేశాడంటారు! అంతేనా?

రామూ: వాళ్ళనుకట్టుతాళ్ళు వాళ్ళే తెచ్చుకున్నారులే. గట్టిగాఅంటుకోట్టు

హరి: (రామూరావు వైపు చూచి కోపంగా) ఛీ, నీ జన్మ తగలెయ్య. మనిషివై పుట్టావ్ ఎందుకురా.

(పోలీసులు రైతులిద్దరను నెట్టుకుపోతూ ఉంటారు)

కొండ: ఒరి, నీ పాపము పండుగాను. (కాంతారావు వైపు చూచి హేళనగా) ఇదే సంటయ్యా? నీ న్యాయం. ఇది కాంగ్రేజా! అంగ్రేజా!

కాంతా: ఏడ్వకులే గాండిరా. న్యాయమో అన్యాయమో స్టేషన్లో తేలుతుంది. (రైతులను నెట్టుకుంటూ పోలీసులు వెళతారు)

హరి: కాంగ్రెసు ముసుగుతో ప్రజల గొంతులు కోస్తున్నారు మీరు.

కాంతా: (కోపంగా) నోరుముయ్. నిన్నగాక మొన్న పుట్టావ్ నీకేం తెలుసు రాజకీయాలు.

హరి: మీ రాజకీయాలకి, రామరాజ్యానికి ఒక నమస్కారం. (రివ్వున బయటికి వెళ్ళిపోతాడు)

రామూ: పోరా వెధవ. నీలాంటి తుక్కు రకం అంతా పోవాల్సిందే.

(కాంతారావు హరి వెళ్ళిన వైపుకు తీవ్రంగా చూస్తూంటాడు)

కేశ: (నవ్వుతూ కాంతారావు నుద్దేశించి) మహానుభావులు, "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అన్నారు పెద్దలు. ఏమి రాజనీతంకీ మీది. (కాంతారావు ముసిముసి నవ్వులు నవ్వుతూ వుంటాడు.)

[ తెర ]

---

## తెలంగాణా పిలుపు

శ్రీ దాసరి కృష్ణమూర్తి

★ ★

లేవండోయ్! లేవండోయ్!
కార్మిక కర్షక యోధుల్లారా
నైజాం పాలన నశింప జేయగ
ముందుకు రారండోయ్!
భర్త ఎదుట భార్యను చెరిచే
గూండా రాజ్యం తుద ముట్టించగ
రా రండోయ్!

వీరుల రక్తం
విరిసిన జెండా
ప్రజా రాజ్యమును
స్థాపిస్తుందోయ్!
రారండోయ్!
లేవండోయ్!
రా! రండోయ్!

(24 వ పేజీ తరువాయి)

"ఇంతకంటే, గాజుల బత్తుణ్ణి పిలిపిస్తున్నావే! ఈ ప్రతాపమంతా నీదా యేంది?" అని ఒళ్లు తెలీకుండా అరవడం మొదలు పెట్టాడు రామిరెడ్డి.

"కాదు, మామా, ఏడెనిమిది లారీలు వస్తున్నయ్. రెండు మూడొందలమంది వుంటారు. మన దగ్గిరేమున్నా తుపాకులా పాడా? అందుకని..."

"ఇదుగో సీతమ్మా, చూడు, ఇది ఆడంగులు మాట్లాడే సమయం కాదు. మూతి మీద మీసం వున్నవాడు తోకముడిచి పారిపోతాడా అంట! ఎన్ని వందలమంది వొచ్చినా సరే, నా గొంతులో ఊపిరి వుండగా ఈ గడ్డమీద అడుగు పెట్ట నివ్వను. అంతే! ఇక్కణ్ణుంచి ఒక్క ప్రాణి బయటకు పోగూడదు!" అని రామిరెడ్డి చండ శాసనంగా మాట్లాడు తున్నాడు.

గోపాలరావూ వీరప్పా తమకు నచ్చ జెప్పాలని చేసే ప్రయత్నం చూస్తే అతనికి మరీ మండిపోతుంది. చేతిలోవున్న తుపాకీ ఎత్తి ఆ పాలిక మందికీ బారు చేసాడు

"ఎక్కడికీ పోనివ్వను. ఇక్కడే వుండి తీరాలి. నడవండి ముందు! లోపలికి..."

తుపాకి చూపి అందర్నీ మేడ గదిలోకి నడిపించి బయట గొళ్ళెం పెట్టాడు. తాను ఇంకో గదిలో కెళ్ళి, ఒక్కడ దాచి వుంచిన తుపాకి మందు తెచ్చి వరండా నాపరాతిమీద కుప్పగా పోసి, గొళ్ళెం తీసి వీరప్పనూ గోపాలరావునూ మరి అయినగుర్ని బయటికి రమ్మన్నాడు పిలవకపోయినా, సీతమ్మకూడా వచ్చినిల్చుంది.

"ఆడదానివి..." ఏదో అనబోయి, మళ్ళీ తిప్పుకొని "నువ్వు తుపాకిలో మందుకూరి ఇస్తావుండు. వీళ్లు అంచెల మీద డాబామీదికి నాకు అందిస్తా వుంటారు" అని పని స్వభావం ఏమిటో తేల్చి చెప్పి, రామిరెడ్డి తుపాకీ తీసుకుని ఊసులాడుతు ఎనిచ్చెన మీదిగా డాబామీది కెక్కి, పిట్టగోడ మాటుచేసుకొని పొలాల మీదికి చూస్తూ పడుకున్నాడు.

దూరాన గుట్టల్లోంచి దొంకనే పడు తోసుకొస్తున్న లారీలు ఆకాశం నిండా దుమ్ము కొడుతూ రణగొణధ్వని చేస్తూ ఇంకా ఇంకా దగ్గిర కొచ్చేస్తున్నాయి. లారీల్లో మనుషులు కన్పిస్తున్నారు... ఆ బ్రెన్ గన్లూ, ఆ రైఫిళ్లూ, ఆ బయొనెట్లూ - అవీ...

రామిరెడ్డి చేతిలో తుపాకీ ప్రచండంగా గర్జించింది. తొలిగా వస్తున్న లారీ ఈ లేసి కూలిపోయింది. లారీలోంచి పోలీసులు నఖముఖాలా దూకుతున్నారు. ఒకటి కాదు, రెండు కాదు—వందల తుపాకుల నిప్పులు కురిపిస్తున్నాయి. ఆ లారీల లేపిన దుమ్మంతా అంతలో ఎగ్రపడి పోతున్నది. ఒక మరతుపాకీ చిటపెటలాడుతూ సింగరు మినపనులా, కొట్టుకుంటున్నది పోలీసు తుపాకులు కక్కిన వేలకొలది గుళ్లు గాలిలో కలిసిపోతున్నాయి. కొన్ని డాబా గోడలకూ పిట్టగోడకూ తగిలి తిరుగ ముఖం పడుతున్నాయి.

ఇక్కడ రామిరెడ్డి తుపాకికి మంద

సరఫరా శరవేగంతో జరుగుతున్నది. ఒక్కొక్క మనిషి వందమంది బలంతో పనిచేస్తున్నాడు. మూడు తుపాకీ, అంచెల మీద నడిచే తుపాకీ, శత్రువులమీద మృత్యువును విసిరే తుపాకీ.....ఒక్కటే అయినా... వెయ్యి తుపాకులుగా నడిచి పోతున్నది

కేక పెట్టి మన్ను కరుచుకున్నాడు ఒక రజాకారు. ఇంకొకడు గింగిరాలుతిరిగి చెట్టును అంటుకుపోయాడు. మరొకడు లారీమీదనుంచి పడ్డపాటున గుట్టమీద పడి, పక్కనేవున్న గుంటలోకి దొర్లి పోతున్నాడు.

శత్రువుల మందిబలాన్ని మందుబలాన్ని చిందరవందర చేసింది నాటుతుపాకీ. రజాకార్ల సారాకైపు పూర్తిగా దిగిపోయింది. ఈ గ్రామంలో యెంతమంది కమ్యూనిస్టు కాఫిర్లు ప్రజాకంటకులైన వాళ్ళున్నారో- సార్జెంటుకు అనుమానంగా యిప్పుడిప్పుడే స్ఫురిస్తున్నది

మరతుపాకిదగ్గర కూచున్న ముస్లిం యువకుడు దానితో పైనేసుకుని మెలికలు తిరిగిపోతూ, నేలమీద పడుకుని పోయాడు. ఒకడా, ఇద్దరా? ఏ ఒక్క మత సైనికుడూ ఒంటరిగా పోరాటం లేదు. అసలు ఒంటరిగా పోరాడే అలవాటుకూడా లేదు వాళ్ళకు. ఆ పోరాటంలో లోపలైనా ప్రజలనేవాళ్లు వుంటారని గ్యారంటీ ఏమిటి? ఒక్కొక్కడూ కోటి సైనికుల్ని తోడు తీసుకొని మరీ పోతున్నారు.

ఒకళ్లూ ఇద్దరూ కాదు. డెబ్బై ముగ్గురు రాజబంధువులు రజాకార్లు నిస్సంకోచంగా తెలుగు గడ్డమీద తమ శరీరాలు పరుచుకున్నారు.

ఇంకా రామిరెడ్డి తుపాకీ కాలు దువ్వుతూనేవుంది పాపమనైనా లేకుండా, రాజబంధువుల్ని నేల రాస్తూనేవుంది.

సార్జెంటు మతి మతిలో లేకుండా పోయింది. కాని యుద్ధనీతిలో నేమి రాజనీతిలో నేమి ఆ మతోన్మాదకుడు బాగా ఆరితేరినవాడు గనుక, ఎట్లాగైనా జారిన కాలు నెమ్మదిగా తీసుకోవాలనే నిశ్చయానికి వచ్చేసాడు. అయినా, ఈ కాఫిర్ ముండాకొడుకులు పోలిస్తేనా? వాడు తిరుగుముఖం ప్లాను ఆలోచిస్తూనే వున్నాడు; రాజబంధువులు ఆ గుట్టల్లో గోతుల్లో సిద్ధనివాసాలు యేర్పాటు చేసుకుంటూనే వున్నారు.

అక్కడ మంటల్లో రెండు లారీలు ముక్కలుముక్కలుగా విరిగి నేలమీద రాలిపోతూ, వాటికింద పడున్న రజాకార్లను తెలుగు సంప్రదాయం ప్రకారం అగ్నిసంస్కారం చేస్తున్నాయి. పాపం, వాళ్ళ సమాధులకూడా చోటులేదుగావును ఈ విశాలాంధ్రలో!

రామిరెడ్డి తుపాకీ ప్రళయ ప్రళయంగా అగ్నిపర్వతాలు విరజిమ్ముతున్నది. అతని మాటప్రకారం తుపాకిదెబ్బకూడా వ్యత్యాసం చూపడం లేదు. ఎవడిమీద కన్నుపడ్డదో వాడిమీద దెబ్బపడ్డదే!

తను విజయం కళ్ళారా చూస్తున్నాడు గాని, యింత మాత్రంతో అతని బాధ్యత తీరేది కాదు. ఈ వూరు వుంది. ఇక్కడి ప్రజలంతా తన వాళ్లు; తను చెప్పినట్టు

నడుచుకోవలసిం వాళ్లు. వాళ్లందరి ప్రాణాలకూ పూచీ పడవలసినవాడు తనే

ఇంత ఆలోచనతోనూ, నిబ్బరంతోనూ తుపాకీ కాలుస్తున్నాడు రామిరెడ్డి. అంతలో హఠాత్తుగా 'అమ్మా' అంటూ పొత్తికడుపు పట్టుకొని ముడుచుకుపోయాడు. పక్కగా చెట్టుమీది కెక్కి వున్న రాఘవరెడ్డిని అప్పుడే ఆ ముడుచుకుపోతూ లీలగా గుర్తుపట్టాడు. పొత్తికడుపులోంచి రక్తం ఓడికలు కడుతున్నా అతని నరాలు ఒక్కసారి జీవంతో చకితమైనాయి. శరీరం ఒక్కసారిగా సాగింది. అంచెమీద వచ్చిన తుపాకీ అందుకున్నాడు. ఒక్కటే దెబ్బ. కేక పెట్టి, గిరాగిరా తిరుగుతూ రాఘవరెడ్డి నేల మీదికి రాలిపోతున్నాడు. రామిరెడ్డి కళ్ళ నిండా కమ్ముకున్న నీళ్లు కారకుండా అతని రెప్పలు కప్పివేసాయి.

గోపాలరావుకు గానీ వీరప్పకుగానీ తుపాకి కాల్చటం తెలీదు తక్కినవాళ్లకు అదంటేనే భయం ఏమైనాసరేనని, గోపాలరావు కొత్తగా సాధన చేసి దాని విసురుకు తట్టుకోలేక వదిలెయ్యడంతో అక్కడ పోగుపడున్న తుపాకి మందు కాస్తా గుప్పున మండిపోయింది.

మళ్లీ తుపాకిదెబ్బ వినిపించకపోవడంతో రజాకార్లకూ పోలీసులకూ క్రమక్రమంగా గుండెలు కుదుటపడుతున్నాయి. ముందుకు పోదామా అని సార్జెంటు అనుకుంటున్నాడే కాని, వాడు తెలివైన మనిషి. వాడికి గెరిల్లాల ఎత్తుగడలతో అదివరకు స్వంతంగా పరిచయం లేకపోయినా చాలా కథలు విన్నాడు. వందమందికి పైగా తన సాయుధ సైనికులు కూలిపోయారంటే, అవతల ఎంతమంది కాఫిర్లువుండి వుండాలో వాడు సులభంగా అంచనా వెయ్యగలడు. అయినా, ఎంతసేపని వాడు అలా గుండు వస్తుందేమోనని ఎదురుచూస్తూ వుంటాడు? తన శరీరం ఒక్కసారి తడివి చూసుకున్నాడు ఏమీ చెక్కుచెదిరినట్లు లేదు. అసలు వాడికి ముందుగానే తెలుసు – ఈ గెరిల్లాలు ఎంతమందున్నా వాణ్ణేంచెయ్యలేరని. "ముందుకు నడవం"డని పోలీసులకూ రజాకార్లకూ ఆజ్ఞాపించాడు. వాళ్లూ పదిలంగానే ప్రతి అంగుళం ఆక్రమిస్తూ ఊరిమీద వచ్చిపడ్డారు. డాబాచుట్టుముట్టి మొత్తం పాతికమందినీ పట్టుకుని గోడ కానజేసి వరసగా నిలబెట్టారు.

పోలీసుల్ని నడుపుతూ వెనకగా వచ్చిన సార్జెంటు ముందుకొచ్చి ఠీవిగా నిలబడ్డాడు. అతనిచేతిలో రివాల్వరు ఊగులాడుతూ చుట్టూ చూస్తున్నట్టుంది.

వాడికి ముందే తెలుసు. ఇక్కడ ఏ వందమందో హిందువులు వుండి వుంటారు. తీరా ఇప్పుడు పాతికమందే దొరికితే తక్కినవాళ్లెక్కడో దాక్కొనివుండాలి. ఈ మాత్రం తెలీదా వాడికి.

తాను నడిచే నేలమీదకూడా నమ్మకం లేదేమోవాడికి, నిదానంగా అడుగులేస్తూ శీతమ్మ దగ్గరకొచ్చి రివాల్వరుతో ఆమె రొమ్ముమీద ఘటీమని పొడిచాడు.

"లంజా! తక్కిన వాళ్లనెక్కడ దాచావు?"

ఆమె మొహం ఎఱ్ఱగా కందిపోయింది. క్రోధంతో నల్లబడుతున్నది. వీరప్ప శరీరం ఉద్రేకంతో పొంగిపోయింది. తను పట్టుకున్న పోలీసును విదిలించి నేలకు కొట్టి సార్జంటు గొంతు పట్టుకొని నొక్కి పారేస్తున్నాడు. కాళ్లు తేలిపోయి గిల గిల్లాడుతున్నాడు సార్జెంటు. ఒక్కసారిగా కంద తుపాకులు పేలిన మోత. సార్జెంటుతో పాటు నేలమీద పడిపోయాడు వీరప్ప

శవంగా నేలకు కరచుకున్న సార్జెంటును చూసాక, పోలీసులకూ రజాకార్లకూ 'గెరిల్లా'ల మీద 'నమ్మకం' పోయింది. ఇంకా వీళ్లనమ్మి దగ్గరకు రావడానికి వీల్లేదు.

"వరసనే కాల్చి పారెయ్యండి!" అని అరిచాడొక పోలీసు. మరొకడు ఈ గెరిల్లా శ్రేణికి రెండు గజాల దూరంలో నుంచుని "ఆగండి తక్కిన వాళ్లెక్కడ దాగారో కనుక్కుంటాను" అని సార్జెంటు చేతిలోంచి జారిపడిన రివాల్వరు చేతికి తీసుకుని,సీతమ్మవైపు గురిపెట్టాడు.

"రావే లంజా, ముందుకురా" అని గద్దించాడు పోలీసు. ఆమె అడుగు ముందుకు వెయ్యలేదు. సరికదా, చలించనైనా లేదు.

"వస్తావా? లేదా?" మళ్లీ కేక మళ్లీ చలనంలేదు. రివాల్వరు మోగింది. "ఆంధ్ర మహాసభకూ జై" అంటూ ఆమె కూలిపోయింది.

గోపాలరావు కళ్లల్లో నీళ్లుకాదు, నిప్పులు తిరిగాయి. చావుకు రెండు చావులా? ఎగబడి, దగ్గర్లోవున్న పోలీసు వాడిచేతిలో తుపాకిలాక్కొని, అందిన వాణ్ణల్లా తిరగేసి కొట్టడం ఆరంభించాడు. తక్కిన ఇరవైముగ్గురికీ మంచి ఉపాయమే దొరికింది; తుపాకులు పోయిన పోలీసులు టోపీలు పడిపోయిందికూడా చూడకుండా పారిపోతున్నారు. మిగతావాళ్లు తిన్నగా గాభరానుంచి తేరుకుని కాల్చటానికి తుపాకులు గురి చూసుకుంటున్నారు. ఒకటి రెండు తుపాకులు పేలాయి. ఒకరిద్దరు 'గెరిల్లా'లు పడిపోయారు.

బాణాకర్ర దెబ్బలాగా 'గెరిల్లా'ల తుపాకిదెబ్బ తిన్న పోలీసు మళ్లీ నడుం ఎత్తినపాపాన పోవడంలేదు మళ్లీ తుపాకులు పేలుతున్నాయి. 'గెరిల్లా'లు పడిపోతున్నారు.

"కమ్యూనిస్టుపార్టీ జిందాబాద్" అని ఎక్కడో కొండలలోగుట్టలలో అరుస్తున్నట్టు గాలి కబురు తెచ్చింది. తుపాకులు తిప్పి పట్టుకున్న 'గెరిల్లా'లకు పోయిన ప్రాణాలులేచి వచ్చినట్లయింది. "కమ్యూనిస్టు పార్టీ జిందాబాద్! "ఒక రజాకారు నెత్తురు కక్కుకుని మన్ను తింటున్నాడు. ఒక పోలీసు మెడ తిరిగిపోయి అల్లాడ తల్లడై పోతున్నాడు.

"కమ్యూనిస్టు పార్టీ జిందా బాద్!" "ఆంధ్ర మహా సభ జిందాబాద్" మళ్లీ కొండలూ గుట్టలూ మరింత గట్టిగా అరిచాయి. చుట్టూ ఈలలు రక రకాల ఆరోహణలతో వినిపిస్తున్నాయి.

పోలీసులకూ రజాకార్లకూ ఇలాంటి ఘట్టాలు అనేకం తెలుసు. ఇలాంటి ఆపత్సమయాల్లో ఎవడి కర్తవ్యం వాడు నిర్ణ

యించుకోవడ మనేదే వాళ్లనీతి ఎవడి దోవ వాడు చూసుకోవాలన్న తహ తహ ప్రారంభ మైంది యూనిఫారాలు నేలకు కొట్టి లోపలి బనీను, ధోవతులతో మందలు మందలుగా పారి పోతున్నారు పచ్చ చొక్కాలు పారేసి పరుగెత్తుతున్నారు రజాకారు వీరులు.

ఊరిచుట్టూ ఒక్కసారి ఫెటేల్ ఫెటేల్మన్న గెరిల్లా తుపాకులు నోళ్లువిప్పిన శబ్దం ప్రతిధ్వనించింది. మళ్లీ నిశ్శబ్దం. అక్కడా అక్కడా చిన్న చిన్న గద్దింపులు.

మళ్లీ పెద్దపెట్టున నినాదాలు మొదలు పెట్టాయి. "కమ్యూనిస్టు పార్టీ జిందాబాద్! ప్రజాసైన్యం జయించాలి!!" వేల గొంతులు - ఆడగొంతులు, మగగొంతులూ, ఒక్క గొంతుగా మోగుతున్నాయి

అంతదాకా నిర్మానుష్యంగా కనిపిస్తున్న గ్రామం ఒక్కసారి నిద్రలేచి నట్లయింది. ఒక మహా తేజస్సు విరజిమ్మే జ్వాలనేత్రం వికసించి నట్లయింది శ్మశాన శాంతి బద్దలై ఒక మహాక్రాంతి ప్రాదుర్భవించి నట్లయింది.

చుట్టుపట్ల కొండల్లోగుట్టల్లో దాక్కొని పోయిన ప్రజలంతా, గెరిల్లా దళంతో పాటు తిరిగి వచ్చేస్తున్నారు. ఇక రజాకార్లకూ పోలీసులకూ పారిపోయే దోవ లేదు వీధుల్లో ముంగుల్లో సందుల్లో గొందుల్లో కొండల్లో కోనల్లో అంతటా ఒక్కటే ప్రజా సైన్యం.

రజాకార్లు పోలీసులుదళంగా చేతులు కట్టుకుని ముందు నడుస్తున్నారు

## గమనిక

ఈ సంచికను ఎక్కువ రచనలతో, చిత్రాలతో తెలంగాణా ప్రత్యేక సంచికగా ప్రకటించడం వల్ల "అభ్యుదయ" జూన్ నెల సంచిక వెలువడదు. పాఠకులు గమనించ ప్రార్థన.

— సంపాదకులు.

క్షణంలో అందరూ అన్ని మూలలనుంచీ రామిరెడ్డి దొరబాముందుకు వచ్చి, బార్లు తీరి నిలబడ్డారు గెరిల్లాదళం నాయకుడు జగన్నాథరెడ్డి, దెబ్బలుతిని కకావికలుగా వున్న మొగవీరులకు వెన్నుతట్టి ధైర్యం చెబుతూ, గోపాలరావు దగ్గరికి వచ్చాడు.

బాయొనెట్ దెబ్బకు గోపాలరావు వెన్ను గాయపడివుంది కక్కుకున్న రక్తం నోటినిండా నిండి, నాలికను చుట్టుకొని, నోరు పెగలకుండా వుంది. తల తిరిగి పోతున్నది మరి నిలబడేశక్తి లేదు. కాని, అతనికి దళాధిపతిమీద ఉన్న గౌరవం అంతంతమాత్రపుది కాదు; అది హృదయంలోంచి ఉట్టి పడుతున్నది

"కమ్యూనిస్టుపార్టీ జిందాబాద్!" అని పిడికిలిబిగించి, ఆ రక్తజిహ్వకతో దళాధిపతికి తన తుదిఅభినందనాలు తెలియ జేసాడు గోపాలరావు; అవే అతని తొలి అభినందనాలు కూడా!

(16 వ పేజీ తరువాయి)

సాధించక మానరు' మొదలైన కథలనేకం వచ్చాయి.

జైత్ర యాత్ర అవిచ్ఛిన్నంగా సాగుతుంది. తమ గ్రామాలను భూములను తమ వశం చేసుకుని ప్రజా ప్రభుత్వాన్ని స్థాపించు భూమిపంపకం జరిపి ద్రోహులను శిక్షించి శాంతి నెలకొల్పారు. పోలీసులు ఈ గ్రామాల్లో అడుగు పెట్టడానికిహడలిపోతారు. ఏమూల నుంచి ఎవరు వస్తారో! ఏంచేస్తారో! పూర్వంనుంచీ చేసిన పాపాలకు ప్రతిఫలం తప్పుతుందా! పోలీసుల భీరుత్వాన్ని చాకచక్యంగా 'బండారం' అనే కథలో శ్రీ కె వి. రామారావు హేళన చేశాడు.

శ్రీ టి. కె విశ్వనాథం వ్రాసిన "మూడు తుపాకులు" అనేకథ ఒక కొత్తసమస్యను ఎత్తిచూపుతున్నది. తెలంగాణాలో ధైర్య సాహసాలతో ఆయుధాలు సేకరించి నైజాం రాక్షసత్వానికి వ్యతిరేకంగా పోరాడే నారాయణను యూనియన్ పోలీసులు అరెస్టు చేస్తారు. బ్రిటిష్ (అ) న్యాయ శాస్త్రాన్ని ప్రయోగిస్తారు. శిక్షిస్తారు. ఆంధ్రప్రజలు ఏకకంఠంతో ఈ విశాలాంధ్ర పోరాటాన్ని ప్రోత్సహిస్తోంటే యూనియన్ ప్రభుత్వం తెలంగాణా వీరులను బంధించి నైజాం ప్రభుత్వాన్ని బలపరుస్తోంది. ఈ ద్రోహాన్ని "మూడు తుపాకులు" కథ బట్ట బయలు చేస్తుంది. ఈ సమస్యను గురించి కథలకంటె నాటికలెక్కువగా ప్రచురితమైనాయి.

ఒక ఉత్తమాదర్శాన్ని సాధించటానికి తెలంగాణా ప్రజలు జరుపుతున్న జీవన్మరణ సంగ్రామంలో ఈ కథలు వెలువడుతున్నాయి. ఈ పోరాటంలో పాల్గొనే రాజకీయ వర్కర్లు, యువరచయితలు ఈ కథలద్వారా తమ ధర్మాన్ని నిర్వర్తిస్తున్నారు. అందుచేత, సహజంగా వీటిలో రాజకీయ ధోరణులు స్పష్టంగా కన్పిస్తాయి.

కథాశిల్పం, శైలి, నిర్మాణం, పాత్రపోషణ కోరవడవచ్చును. కొన్ని కథలు మాత్రమే ఉత్తమ సాహిత్యశ్రేణికి చెందినా, అన్ని కథలూ ఉత్తమాశయ ప్రబోధః

చెయ్యటంలో ఫలప్రదమౌతున్నా యనటం నిర్వివాదాంశం.

ఈ మహోద్యమ ప్రాధా న్యాన్ని సహజంగా అభ్యుదయ రచయితలు మొదటే గ్రహించారు. ఆ పోరాటంలోని వివిధ దశలనూ వివిధ కోణాలనుంచి పరిశీలించి చిత్రించటానికి శక్తివంచన లేకుండా కృషి చేస్తున్నారు. తెలంగాణా స్వాతంత్ర్య సంగ్రామం ఆంధ్రజాతి చరిత్రలో ఎంతమహత్తరమైనదో కొన్నాళ్ళకు ఆంధ్రరచయితలంతా గ్రహిస్తారు. ఉత్తమ సాహిత్యం సృజిస్తారు. "మేంసాధించిన విజయం ఇది" అని ముందు తరాల వారికి అందిస్తారు.

[నాటికలు, గీతాలనుగురించి వచ్చే నెల మరొక వ్యాసం ప్రకటిస్తాము]

అభ్యుదయ రచయితల

## మహాసభ

మే 14, 15, 16 తేదీలలో బెజవాడలో జరుపదలచిన ఆంధ్రాభ్యుదయ రచయితల మహాసభ అనివార్య కారణాల వల్ల వాయిదా వేయబడినది.

ఆంధ్ర ప్రజానాట్యమండలి మహాసభకూడా వాయిదా వేయబడింది.

— కొమర్రాజు వినాయకరావు
— ప్రయాగ కోదండరామశాస్త్రి
కార్యదర్శులు

కథ

# పాగల్ యల్లమంద

'కిరణ్'

ఊరు చేరేప్పటికి కోడిగూసింది. కొందరు యిళ్ళకు బోయి కావళ్లేసుకున్నారు. కొందరు ఊరు ముందరే కొట్టాల్లో ఎడ్లను నీళ్ళకొదిలి ఆరకలూ, పగ్గాలూ సద్దుతున్నారు. ఊరవతల భాగంలో ఇళ్ళకువెళ్లే వాళ్లు చాలామంది బొడ్రాయిదగ్గరనిలుచుని మాట్లాడుకుంటున్నారు.

"దాదా, అంత ముసలోడు! ఎట్లా పోట్లాడిండురా!"

"శీతమ్మను, శీతమ్మో! అబంసుబం ఎరుగదుగదా, ఎంత ధైర్యమొచ్చింది. పోలీసోడి బుర్ర బగలేసిందిగదా! ఆ రోకలి బండ దొరికినందుకనుకోవాలి!"

"అబం సుబం యెరక్కపోతేమటుకు యేంజేస్తుంది. పిల్లి సహా ఎటూ వీల్లేకపోతే ఎగిరి మీదకు దుముకబట్టుతేగారి!"

"అబ్బో, కమలంటే కమలా, యేం పాటలు, యేం పుపన్యాసాలు— జనాన్ని కదలేసిందనుకోండ్రి. వీరారెడ్డి అట్ల తయారు జేశిండు."

"అబ్బ! దాదా, శీతమ్మ! వాళ్ల పొట్టని బెట్టుకున్రు, రాకుసి ముండాకొడుకులు. వాళ్ళదగ్గర తుపాకులులేకపోతే గినకనా?

"అయితే యేం? మనోళ్ళే గెలిశినారు. వీరారెడ్డిని జైలునుంచి యిడిపించుకున్రి. దేశముఖుగాడు కుక్కోలె పారిపాయె.

"ఆ మస్తానుగాడికీ పటేలుగాడికీ భలే తన్నులు తగిల్నాయి ఆ కుక్కల్ని ఊళ్ళోనుంచి తరిమేస్తిరి."

యల్లమందంటే యల్లమందా: మస్తాన్ గాడు తిన్న దేవరపోతును కక్కేశిండు. కళంటే అది. అట్టుండాలి.

"ఇదంతెందుకు? గెలిచారు! వాళ్ళ సేలువాళ్లు మళ్లీ దున్నుకుంటున్నారు. మన సేలు మనకొచ్చేదెప్పుడో?"

"ఏమో! సందయ్య"

అందరూ ఇలామాట్లాడుకుంటున్నారు.

గొల్లబోయన్న యేమీ మాట్లాడ్డంలేదు. ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

"ఇప్పుడయ్యిందేంద్రి? పోరాదిరి? పొద్దెక్కుతుందది" అన్నాడొక ముసలి

రైతు ఎవరిళ్ళకు వాళ్లు బయలుదేరారు. ఇంతలో—

"పోలీసులు! పోలీసులు!" అని కేకలు.

ఆ మృగాలప్పుడే అరుస్తూ లాఠీలు తిప్పుకుంటూ యిళ్ళమీద పడ్డారు.

"ఏయ్! దర్వాజా ఖోల్!" ఒక్కతన్నుకు ఒక యింటితలుపు బద్దలైంది.

"గింజల్! హొక్కాభపాసేశావ్! బోలో సువర్!" ఒక ముసలిరైతు నడుంవిరిగింది మరోయింట్లో.

యీ గందరగోళానికి భయమెత్తి, బుట్టలకింద కురకురలాడుతో రెక్కలు కొట్టుకుంటూన్న కోళ్లను "యీమకక్కలెత్తకపోతా రనుకుంటూ" వదలిపెట్టుతూంది ఒక ముసలమ్మ

"ఏయ్‌బూఢీ! ముర్గీకో..." ఒక్కతన్నుకు ముసలమ్మ బుట్టలమీదుగా పిల్లిగంతేసింది.

"నీ మొగ్గు హోక్కాసచ్చాడ్? బోలో!" ఒక యువతిని జుట్టుపట్టుకుని బైటికి లాక్కొచ్చారు మరోయింట్లోనుంచి.

"దాన్ని మొగ్గు క్యోంరే?" అంటూ నల్గురు పోలీసులు వెనుకలాగుతూన్న ఆశీలవతిచుట్టూ చేరారు.

అరుపులు, పెడబొబ్బలు, బూతులు, ఏడుపులు అంతా భీభత్సంగా వుంది. బొడ్రాతిదగ్గర జనం అంతా ఒక్కమారుగా పరుగెత్తబోయారు. "ఆగ్రు" ఖంగున అరిచాడు బోయన్న. గొర్రెమేతకుకొమ్మలు నరికే కత్తిదోటీ పేకెత్తి నిలుచున్నాడు బోయన్న. జనంఅంతా తక్కునఆగారు.

"ఎక్కడికి పరిగెత్తేది? పదిమంది పోలీసోళ్లొత్తే పారిపోతారు! ఆడోళ్లను నూసినా సిగ్గులేదారి?" అని అరిచాడు.

జనం గిరుక్కున వెనక్కు తిరిగింది. ఆయువతిచుట్టూ చేరిన పోలీసులను చుట్టుముట్టారు, పట్టరాని క్రోధంతో తిడుతూ. లాఠీలకు మనుషులు చాటుకాలేదు. శరీరాలు హూనాణమై పోతున్నాయి. బోయన్న దోటీ పక్కవాటుగా లేచింది. దోటీ కత్తి రివ్వున్నది యింద్రధనుస్సులా మెరిసింది. ఒకపోలీసు మెడకాయ సగంతెగింది.

మిగిలిన పోలీసుల లాఠీలూ, టోపీలూ అక్కడే ఉన్నాయి. దూరంనుంచి "రేపు మీ పని" అని కేక వినపడ్డది.

* * *

ఆవూరివాళ్ళను నలభైమందిని ఒకపగ్గానికి కట్టి తాలూకాకీడ్చుకొచ్చారు. చుట్టూ యాభైమంది రిజర్వు పహరానిల్చున్నారు. తుపాకుల సన్నీలు నాల్కలు గోరుతున్నాయి. బల్లమీద రివాల్వరు. చేతులో హంటరుతో యిన్‌స్పెక్టరు. పొడగాటి కొరడాలతో యిద్దరు గూండాలు నిలుచున్నారు. పక్కన ఆ వూరిపటేలు చేతులు కట్టుకుని ఉన్నాడు.

"పోలీసును చంపిందెవడురా?" యిన్‌స్పెక్టరు మొరిగాడు. ఎవరూ మాట్లాడలేదు.

"ఊఁ, బోల్తా హై? నహీఁ?" ఎవరూ మాట్లాడలేదు.

ఇన్‌స్పెక్టరు పటేలుకు సైగచేశాడు. పటేలు లిస్టులోంచి పేర్లు చదవడం మొదలెట్టాడు.

"వెంకటరెడ్డి...!"

పోలీసుల కొరడాలు అతని శరీరంపై చటుల్, చటుల్ మోగుతున్నై. ఇన్స్పెక్టరు రివాల్వరు గురిపెట్టాడు.

"అభి! బోలో!"

'నాకు తెలియదు'?

రివాల్వరు క్లిక్కుమన్నది. ధామ్మని పేలింది. కాసేపటిలో ఆరుగుళ్ళు పేలినయి. ఆరుశవాలు పడ్డయ్. "ఛీ! గుళ్లయిపోయినై." అంటూ రివాల్వరును బల్లమీద పడేశాడు.

పటేలు పేర్లు పిలుస్తూనే వున్నాడు.

ఒక్కొక్కరికీ కొరడాలతో శరీరాలు బద్దలైనవి. నెత్తురు ఓలలైనవి. కాని యెవరూ "మాకు తెలియదు" ఒకటేమాట.

పోలీసులకూ, యిన్స్పెక్టరుకూ విసుగెత్తింది; అలుపొచ్చింది. "షాండి! సూకర్ భాంచేత్! తరవాత చెప్పిస్తా. కొట్లో తొయ్యండిరా వీళ్లని," అన్నాడు.

"బోయన్న!"

పటేలు చివరిపేరు చదివాడు.

బోయన్న కదలలేదు. తనను గాదన్నట్లు. "అరే! నిన్నేరా! అని వెనకనున్న పోలీసు బూటుకాలితో ఒక్క తన్ను తన్నాడు.

"ఓయ్! నాపేరు బోయన్న గాదోరి" తల వెనక్కుదిప్పి విదిలించాడు. తన్నిన తాపుకు రెండడుగులు ముందుకు బడ్డై.

అరే! బద్మాష్! పిలిస్తే, రావ్! బోపడీ!" ఇన్స్పెక్టరు హంటరుపిడితో దెబ్బమీద దెబ్బ వేశాడు. బోయన్న తొణకలేదు. దెబ్బలు తగిలినచోట నిమురుకోనైనా లేదు.

"నువు పిలిచింది బోయన్న గాదురి"

హరే! నిన్నే! సువర్" హంటరుపిడి బోయన్న ఒంటిమీద విరిగి అంత దూరాన యెగిరిపడ్డది.

ఈసారి పోలీసుకొరడాలు సరుసున్నై. బోయన్న పోలీసులవైపుకూడా చూళ్లేదు. ఎర్రనికళ్లు ఒకటి పటేల్ని, ఒకటి యిన్స్పెక్టరునూ మింగేస్తున్నై. ఉద్రేకంగా-

"నా పేరు యల్లమంద" అన్నాడు.

పోలీసుల గుండెలు కలుక్కుమన్నై. పటేలూ, యిన్స్పెక్టరూ తుళ్ళిపడ్డారు. కొరడాలతో కొడ్తునే ఉన్నారు.

"మా పోలీసును చంపిందెవర్రా?"

"నేనే"

ఇన్స్పెక్టరుకూ, పటేలుకూ ఆశ్చర్యం, భయం. శరీరాలు జల్దరించినై. మిడిగుడ్లు పడ్డై.

"నువ్వైతే యల్లమందా వేరా" యల్లమంద గూబ గుయ్ మన్నది. లాఠీదెబ్బలకు ఒళ్ళంతా కదుములు కడ్తున్నది. కొరడాలు చర్మాన్ని ఒలిచేస్తున్నవి.

"మొనాళ్ళ యల్లమందను కొడితే బయపడిపోయి యేలుముద్రేశిండు. నేనట్లాపిరికపడతాననుకుండరేం! నామర్దా!

దెబ్బలు పడుతూనే ఉన్నై. పెడరెక్కలు విరిచేస్తున్నారు. బోయన్న "నేనే చంపినా! నేనే! నేనే!" అని అరుస్తూనే ఉన్నాడు.

ఇన్స్పెక్టరుజీవితంలో ఒకేఒక్కసారు మానవ సహజమైన ఆలోచనలో పడ్డాడు.

'వాళ్లంతా మాకు తెలీయదన్నారు. వీడు నేనే నంటాడు. ఎంత హింసించినా నేనే నంటాడు. వీడు పాంగల్ కామగ నా.'

పటేలు "వీడికి పిచ్చెంది" మెల్లిగా అన్నాడు. ఇన్స్పెక్టరుకు పిచ్చి అన్న అభిప్రాయం దృఢపడ్డది.

"తహర్ రే! వీణ్ణి వదిలేయండి"

"వదిలేశినుగినా! ఇంకో పోలీసోణ్ణి నరుకుతాడ్రి."

పోలీసులకు రేచిక్కొంత్తింది. అలు పొచ్చిందాకా కొట్టారు. గసపెడుతూ "ఫోరా! పాంగల్" అని లేవదీసి అవతలికి పడేట్టు ఒక్కటన్ను తన్నారు.

"ఆ! పాంగల్! నైజాం యములోళ్లను నరికే పాంగల్" శరీరంలో మిగిలిన సత్తువ నంతా చిక్కబట్టి అరిచాడు బోయన్న.

* * *

తాలూకానుంచి ఆ వూరుకు బోయె డొంకను మరోడొంక అడ్డంగా దూసుకు పోతూంది. రాత్రి ఎనిమిది గంటలౌతుంది. "ప్రజా సైన్యం" ఒక ఏభైమంది వుంటారు. ఆ డొంకనె నడుస్తున్నారు. చీకటిగా వుంది. ఎవరూ మాట్లాడటంలేదు. కూడలి కొచ్చేప్పటికి శ్రేణి ప్రక్కనే నడుస్తున్న దళనాయకు డకస్మాత్తుగా ఆగాడు. కూడలిలో ఎదో కదిలినట్లనిపించింది. కాని కదలలేదు. దానిమీద సరిగ పైనుంచి టార్చి వేశాడు. మనిషి. స్పృహలేదు. శరీరం కాలిపోతూంది. నాయకుడు బుజాన తగిలించిన నీటిసీసాలోంచి చల్లని నీరు కొంచి ముఖాన చల్లాడు. అతడు కొంచెం కదిలాడు. పా...గల్ — య...ల్ల...మంద"...కలవరించాడు. ఎండి పిడచ గట్టిన నోట్లో కొంచెం నీళ్లు జార్చాడు నాయకుడు. అతను కళ్లు తెరిచాడు. ఇంకొంచెం నీరు తాగించిన తరవాత మగత తెలిసినవాడులాగ గభాలున లేచి కూచున్నాడు. "పాంగల్! యల్లమంద! నైజాం యములోళ్లను నరికే పాంగల్! పోవాలె; మా యీరారెడ్డియ్యకు సెప్పవాలె." అంటూ లేవబోయాడు. దళనాయకుడర్థం చేసుకున్నాడు.

"నేనే! వీరారెడ్డిని! యేంజరిగిందేమిటి?"

"నువ్వా! మా యీరారెడ్డియ్యవా నువ్వు. అయితే పంచె, చొక్కా, కంబువా యెక్కడుండయ్య. కమలమేమైంది? యేమో ఊహు...."

"కాదు. యల్లమందా! మన ప్రజాసైన్యం జైత్రయాత్ర బయలుదేరింది."

"అంటే"

"అంటే నైజాం యములోళ్ళ పైన యుద్ధం జేయటానికి మనమంతా సైన్యంగా తయారైపోతున్నాం."

"మొన్న యియ్యాల్లో, అప్పుడే సైన్యం గూడా తయారుజేసిరారి. అదిగది, మా యీరారెడ్డియ్యంటే అంతే!"

"ఇంతకూ సంగతేమిటి చెప్పవూ!"

"మనూరోళ్ళను, పోలీసునాయాళ్ళు జైల్లో పెట్టినారు. ఆపోలీసోణ్ణి చంపింది నేనే నంటే "పోరాపాగల్"అని గంటేశిను. నేను, పాంగల్! నైజాం యములోళ్ళను నరికే పాంగల్."

"ఎంతమందిని జైల్లో పెట్టారు."

"ఆఁ! మన దేశముఖు తాడీసులుయెత్తుకపోయిన నామందలో సగం ఉంటారు."

ప్రజాసైన్యం మలుపు తిరిగి తాలూకా వేపుకు నడిచింది. "ఏదన్రి, నాదోటి నువ్వు దీసుకుండవ్" అని పక్కనున్న ఒక సైనికుడు దగ్గర గండ్రగొడ్డలి లాక్కుని తను బుజానబెట్టుకొని నడుస్తున్నాడు బోయన్న.

అర్ధరాత్రి బీటుమారే టైమైంది. రిజర్వంతా. ప్రజాసైనికుడొకడు వెనకవేపునుంచి చప్పుడు చేయకుండా గోడదిగి రిజర్వువేపుకు ప్రాకుతూన్నాడు. ప్రక్కనుంచి బిల్డింగు చుట్టూ దిరిగి మర్లాకరు పహరా జవానుకు వెనకగా చేరుకుంటున్నాడు,

"ఖడే రహో! కోన్ హై...?" అని అరిచాడు పహరాజవాను. ఎప్పుడు చేరాడో వెనకనుంచి "యల్లమంద!" అని బిగ్గరగా అరిచాడు బోయన్న. జవాను కంగారు పడ్డాడు. వణుకుతూన్న చేతులనుంచితుపాకి కిందపడ్డది; ఇక చేతినుండ నన్నట్లు శబ్దం చేసింది. రిజర్వు కలవరపడిలేచింది. చేతి బాంబొకటి వాళ్ళ మధ్యన ప్రేలింది. బోయన్న "నైజాం యములోళ్ళను నరికే పాగల్" అని అరిచాడు. గండ్రగొడ్డలి పరిగెత్తబోయే పహరాజవాను తల నరికింది. "ఆంధ్ర మహాసభకు జై!............" యాభై గొంతులనూ బిల్డింగు అదరిపడి ప్రతిధ్వనించింది. రిజర్వికలేదు. మూడు శవాలు, పది కూటిశరీరాలు, ఏభై తుపాకులు, యాభైజతలబూట్లు, పట్టీలు ఇతర సరంజామా మిగిలినై.

గండ్రగొడ్డలి దెబ్బకు తాళాలు పగిలినై. "ఆంధ్రమహాసభకు జై"—తొంభై గొంతులు ఆకాశానికి లేచినై.

"దేశముఖు - పటేలు!" అన్నారు వాళ్ళ ప్రయత్నంగా. ప్రజాసైన్యం తమ, కొడవళ్ళూ, కర్రలూ, యీటెలూ విముక్తిచేసి తమలోకి తెచ్చుకున్న వాళ్ళకిచ్చారు.

ఏభై తుపాకులూ తమ బుజాల కెత్తుకున్నారు. ప్రజాసైన్య మిప్పుడు తొంభై మంది. బిల్డింగుకు నాలుగు మూలలా నిప్పంటించి ముందుకు సాగారు ఆ వూరి వైపు. వెనక మండుతున్న బిల్డింగుమంటలు తుపాకి సన్నీల జేగురు కాంతుల్తో తళతళలాడించినై.

ప్రజాసైన్యం వూరు ముంగిటికి చేరుతూంది, "పదండిరా, పదండిరా పదండిరా!

పగలురాత్రి కష్టించి భూములను
పగలదున్ని పండించుటకై"

పాట ఊరినిశ్శబ్దాన్ని ఛేదించింది.

గడీ అంతా "ప్రజాసైన్యం!" "జైత్రయాత్ర!" అని ఒక్కమారు త్రుళ్ళిపడి ఆవులించింది.

దేశముఖు కారేసుకుని వెనకదోవన పారిపోయాడు.

ప్రజాసైన్యం ఊళ్లో ప్రవేశించింది. పటేలు నిద్రమంచంమీదనుంచి లేచి త్రుళ్లిపడి బయటకు పరుగెత్తాడు.

"అడుగో పటేలు" అన్నారంతా

"పట్టుకోండి! ప్రజల కోర్టులో విచారిద్దాం"అన్నాడు దళనాయకుడు. దళనాయకుని మాట ముగిసేలోపలనే, బోయన్న చేతులో గొడ్డలి 'రంయ్'

మన్నది. పటేలు తల తెగిపడ్డది. "యెల్ల మంద! పాగల్! నైజాం యములోళ్ళను నరికే పాగల్; పారిపోయి నోడివి, మళ్ళొచ్చినారి." అని అరిచాడు బోయన్న.

"పటేలు కదే శిక్ష" అన్నారు ప్రజలంతా బిడ్డలూ, స్త్రీలూ, వృద్ధులూ అంతా ఒక్క గొంతుకతో.

దళనాయకుడు బొబ్రాతి అరుగెక్కాడు. సోదరులారా "ఇక మీ భూములు మీరు తీసుకోండి" ప్రకటించాడు.

అందరూ "మా భూమి" అన్నారు సంతోషంతో.

"బోయన్నా! దేశముఖు - కాదు - మనదొడ్లలో నీ మందెక్కడుందో చూసుకోమని" ఒక వృద్ధరైతు కేకేశాడు.

అటు ఓ పక్కన నిశ్చలంగా శాంతంగా నిలుచునిఉన్న బోయన్నదృష్టి ఆ రైతు కేసి తిప్పాడు. "అఁ" అని పలకబోతున్నట్లు నోరు తెరిచాడు స్పృహతప్పింది.



# పా ఠ కు ల కు మ న వి

అభ్యుదయలోని రచనలనుగురించి ప్రతినెల పాఠకులు తమ అభిప్రాయాలను తెలియజేస్తున్నారు. వానిలో ముఖ్యమైనవాటిని ప్రకటిస్తున్నాము.

ఈ 'లేఖలు' శీర్షికలో వీలైనంత ఎక్కువమంది పాఠకులు పాల్గొనవలెనని కోరుతున్నాము. ప్రతినెల పాఠకులు ప్రతిరచనపైన తమ అభిప్రాయాలను సమగ్రంగా సంగ్రహంగా తెలుపుతూ, పత్రికా నిర్వహణను ఒక సమిష్టియత్నం చెయ్యమని కోరుతున్నాము.

స ం పా ద కు లు

'అ భ్యు ద య'

శ్రీ పాటిబండ్ల రామమోహనశర్మ

# మేడే గీతం

శతాబ్దాల
చక్రాల్లో
తిరుగుతున్న
చరిత్రలో
శ్రమజీవుల
స్వర్ణయుగపు
తొలివుషస్సు
పులకించిన .
మేడే యిది !

చికాగో,
వాషింగ్టన్
బెర్లిన్, పారిస్
నగరాల్లో
చిందించిన
శ్రమజీవుల
ఉష్ణరక్త
కాసారంలో
కెందామరలా
విప్లవారుణ
నవపతాకం
వికసించిన
మేడే యిది !

తమ మేధస్సుకు
సంకెల తగిల్చి,
తమ పురోగతికి
అడ్డుతగిలే
పాలక వర్గపు
దోపిడి పద్ధతి
పునాది కూలగ
పిడికిలెత్తి
పీడితప్రజ
గర్జించిన
మేడే యిది!

భవోజ్జ్వల
భావి జగతి
నిర్మించగ
పోరుతున్న
పురోగామి
పీడితప్రజ
కందించే
మేడే సందేశమిది !

" మరువకండి,
మన శ్రామికుల

దోపిడీకుటుంబం
జగతిశాంతి
మాపుజేసి
మనసంపద
దోచేందుకు
డాలరుభూతం
చాచుతోంది
కబంధ హస్తం
కాచుకోండి!

ధనిక వర్గపు
దోపిడినుంచి
విముక్తికోసం,
డాలరు పిశాచి
నాశంకోసం
విప్లవ ప్రతిజ్ఞ
తీసుకోండి!
మరువకండి
కష్టజీవుల
దోపిడీకుటుంబం!"

## ఏజంట్లకు:

కొందరు ఏజంట్లు ఏనెలకానెల బాకీలు చెల్లించుటలేదు. ఇందువలన పత్రికానిర్వహణ కష్టమౌతుంది. కనుక, ఏజంట్లందరూ తామివ్వవలసిన బాకీలను వెంటనే చెల్లించి, ఏనెలబిల్లు ఆనెలలోనే చెల్లించవలెనని కోరుతున్నాము. అలా చెయ్యనివారికి పత్రికలు పంపబడవు.

మేనేజరు

'అభ్యుదయ'

# శాంతిరక్షణకోసం!

శ్రీ మహీధర రామమోహన్



## నాటిక

**ప్రదేశం**

విముక్త తెలంగాణాలో ఒక పల్లెటూరు.

**రంగం**

ఊరిచివర బయలులోని ఒక చెట్టుక్రింద.

**కాలం**

1948 ఏప్రియల్ 10 తర్వాత.

**సమయం**

రాత్రి 9 గంటలవేళ

**పాత్రలు**

జన్మదేశం సంపాదకుడు

ప్రకాశరావు: (ఆంధ్రకాంగ్రెస్ నాయకుడు)

లక్ష్మీకాంతరెడ్డి: (తెలంగాణాలోని ఒక దేశముఖు)

ఇస్మాయిల్: (కాశింరజ్వీ అనుచరుడు)

---

[తెరలేచేటప్పటికి నలుగురూ పెద్దటేబిలు చుట్టూ కుర్చీలమీద కూర్చుని వుంటారు. సరిగ్గా వారినెత్తిపైన చెట్టుకొమ్మకి లౌడ్ స్పీకరు అమర్చివుంది. తెరలోంచి అనేక గొంతులు కోలాహలంగా వినిపిస్తున్నాయి. "కూర్చోండోసే-" "కుర్రవాళ్ళు మీరెందుకె హే-" "ఒబ్బిగా! తలచాటు తియ్యి" మొదలయిన మాటలు వినిపిస్తున్నాయి.

జన్మదేశం: (కుర్చీ చేతులుతట్టి చూస్తూ) దోచితెచ్చిన ఆస్తితోటే మనకీ మర్యాదలు వెలిగిస్తున్నారు కాబోలు!!

లక్ష్మీకాంత: లేకపోతే ఈ మాలపల్లికన్న కనాకష్టం కాదండీ ఈవూరు? ఈవూరుకున్న పేరూ ప్రతిష్టలువున్నాయంటే ఆయన కారణం అనుకోండి. ఏమిభోగి!

ప్రకాశరావు: వినడమే.

లక్ష్మీకాంత: చెప్తే నమ్ముతారో నమ్మరోగాని ఒకమారు నా కళ్ళతో చూశాను. రెండేళ్ళ క్రితం ఒకమారు చూడడానికి

వచ్చాను. పిచ్చాపాటీ మాట్లాడుకుంటూంటే-సరిగా ఇదే టేబిలేమో ననుకుంటాను. (సొరుగులకోసం వెతుకుతాడు) కాదు, అది ఇంకోటి. సొరుగు తీసి ఒక అందమైన బైండు పుస్తకం నాముందు పడేశాడు.

జన్మదేశ : (గుడ్లుతిప్పుతూ,) అంత అందమైనదేం ?

లక్ష్మీకాంత : సందేహమా? చూడడం తడవుగాని డబ్బుకు లెక్క చేసేవాడా?

ప్రకాశరావు : ఏంవుందా పుస్తకంలో ... ?

లక్ష్మీకాంత : పేరు, వూరు, వయస్సు వివరాలతో, మధ్య మధ్యన ఫొటోలతో సహా అతడనుభవించిన ఆడవాళ్ళ పేర్లు వరసన వ్రాసి జాగ్రత్త పెట్టాడు. అప్పటికి 40 ఏళ్ళకి మించి లేవు. పుస్తకంలోకి రెండు వేల నాలుగుపేర్లు ఎక్కించ గలిగాడు. ఎంతపురుషత్వం ? ఎంత భోగం? అల్లాంటివ్యక్తిని చూడబోము.

జన్మదేశ : (కన్నులరమోడ్చి) వుంటారు మహావ్యక్తులు.

[తెరలో కలకలం]

ఒకటోగొంతు : (లౌడ్ స్పీకరు గుండా) ఇంక మనం మనకార్యక్రమం ప్రారంభిద్దాం. మన అదృష్టవశాత్తూ బెజవాడనుంచి నలుగురు పెద్దలు మన గ్రామ ప్రభుత్వం ఏవిధంగా నడుస్తూందో చూసిపోవడానికై మన గ్రామం విచ్చేశారు. వారికి మీఅందరి తరఫునా స్వాగతం సమర్పిస్తున్నాను.

[తెరలో జయజయధ్వనులు వినిపిస్తాయి]

ఒకటోగొంతు : (కొంచెంసేపుఆగి) ఈనాడు మనం ఇంతమందిమి ఇక్కడ ఎందుకు సమావేశమయ్యామో మీఅందరికీ తెలుసును. మట్టయ్యను పట్టుకొని ప్రజల కోర్టుముందు విచారణకు నిలబెట్టాలని గ్రామ ప్రభుత్వం వారంక్రితం నిర్ణయించింది.

జన్మదేశ : ఊళ్ళల్లో ఒక ముఠా వాళ్ళు అలగా జనాన్ని వెంటేసుకోవడం, రెండో ముఠా వాళ్లని చంపేయడం చేస్తున్నారని మా పత్రికకు వచ్చే రిపో

ట్లు వీటిమీదనే కాబోలు! ఎంత ఘోరం!

ఒకటో గొంతు: (లౌడ్‌స్పీకర్ లోంచి) ఆ నిర్ణయం ప్రకారం మన ప్రజాసైన్యం మట్టయ్యని పట్టుకుంది.

[తెరలో "ప్రజాసైన్యానికీ జై."]

ప్రకాశరావు: చీనాలోనూ ఇదే పద్ధతి కాబోలు. చూడాలిగాని చెప్తే యేమిటో అనుకుంటాం ... ఏమీ సందేహం లేదు. తగిన నివారణ లేకపోతే మన భారత దేశంకూడా రక్తపు టేరుల్లో మునిగి పోతుంది.

లక్ష్మీకాంత: లంజ కొడుకుల్ని తన్నే వాళ్లు లేక.

ఇస్మాయిల్: (అసహ్యం క్రోధంతో అందరినీ తినేసేలాగ చూసి) హుఁ!

ఒకటో గొంతు: ఒక్కొక్కరే వచ్చి మట్టయ్యపై గల తమ ఆరోపణల్ని చెప్పమని పిలుస్తున్నాం.

లక్ష్మీకాంత: (ఎగిరిపడి) ఎవర్రా ఆరోపణలు చేయగలది?

ఇస్మాయిల్: (కొరకొరా చూస్తూ) యూనియన్, యూనియన్ అని పలవరించేశారు. ఇప్పుడు తెలిసివొస్తుందా?

జన్మదేశ: (ఇద్దరినీ వూరుకోబెడుతూ) మనం మారుపేర్లతో వచ్చామన్నది, మరిచిపోకండి. పనంతా ముందేవుండగా ఇప్పుడే గోల చేసుకుంటారేం?

[తెరలో అనేక గొంతులు 'ముందు నేను'—'తొలిగుండానాది'— పలు వేపులనుంచీ కేకలు.

ఒకటో గొంతు: (లౌడ్‌స్పీకర్‌లో) ఒకరి తర్వాత మరొకరు రావాలి. నావద్ద కొచ్చిన ఫిర్యాదుల్ని పట్టి వరసన పిలుస్తాను

[తెరలో— "నేనిదివరకు చెప్పకోలేదు, నేనూ చెప్తాను" అంటూ ఒకరు]

ఒకటో గొంతు: (లౌడ్‌స్పీకర్‌లో) ఆఖరున మీరూ చెప్పుకొందురుగాని—

ప్రకాశరావు: ఇల్లాంటి పోరంబోకులందరూ పెత్తనంలోకి వస్తే ఇల్లా ఏడుస్తుందనే ప్రజలందరికీ వోటింగు పనికిరాదన్నారు మన నాయకులు.

జన్మదేశ: ఎంత మేధావులు గాకపోతే! ...

ఇస్మాయిలు : (మిడిసిపాటుతో) అసలు వోటేమిటి? వోటు కావాలని చెప్పేవాళ్ళని కుక్కలు నాకేటట్టు కొట్టాలి. వోటట! వోటు!

లక్ష్మీకాంత : బాగా చెప్పారు. అలగా వెధవలకి వోటేమిటి?

జన్మదేశ : కాలాన్ని బట్టి నడుచుకోవాలి.

ప్రకాశరావు : అందుకే కాస్త చదువుకున్న వాడికే వోటుండాలనేది.

లక్ష్మీకాంత : తప్పు. ఈరోజుల్లో ప్రతి పోసుకోలు పెద్దమ్మా తగుదునమ్మా యని చెరువుకి ఎగబడుతున్నారు. వోటిస్తే నైజాం ప్రభువు లిచ్చినట్లు నూరురూపాయలేనా పన్ను చెల్లించే వాడికిగాని ఇవ్వకూడదు.

ఇస్మాయిల్ : ప్రభుత్వం చేయడం మీ మొహాలకి తెలిసేడిసిందా?

జన్మదేశ : ఎక్కడికక్కడే చెప్పుకోవాలి. మీరన్నమాటలో తభావతు లేదు. ఆసంధ్యవచ్చి అడిగితే ఇట్టేఇచ్చారు రెండు పేజీల ఎడ్వర్టయిజుమెంట్లు.

ప్రకాశరావు : చదువురాని మూర్ఖులకి... ప్రభుత్వం...

జన్మదేశ : చూడండి. మూడునాలుగు వేలమంది వున్నారా? కాస్త షోకా తొడుక్కున్న మొహం వుందేమో చూడండి? (చీదరించుకొని) అంతా ఎద్దుముడ్డి పొడుచుకొనే వెంటయ్యాలూ, పేడఏరుకునే ఎల్లమ్మలూ...

ప్రకాశరావు : ఇల్లాంటి పనులవలన ఊళ్ళల్లో కలహాలు రేపెడుతున్నారు.

ఇస్మాయిల్ : (అసహ్యంతో) ఇదంతా మీరుచేసిందే...

ప్రకాశరావు : ఇల్లాంటి అల్లర్లు అణచెయ్య వద్దన్నామా?

ఒకటోగొంతు : (లౌడ్ స్పీకర్ లో) నాదగ్గరకు వచ్చిన మొదటికాగితం గురవయ్య అనేవారిది. నలుగురు స్టేట్ కాంగ్రెస్ వలంటీర్లు ప్రచారానికి రాగా వారిని గడీలోకి పిలిచాడట, వారింతవరకూ కనపడలేదని వ్రాశారు.

[తెరలో "నిజం...నిజం...ఆరు నెలల క్రితం సరిగ్గా ఇదే రోజుల్లో ... తీసుకుర మ్మని నన్నే పంపేరు .. ఏంచేశాడో కనుక్కోండి" ...మొరలు, కేకలు వినిపిస్తాయి.]

జన్మదేశ : తల్లి ముండా మొయ్య ఎంత నాటకం ఆడుతున్నారు.

ప్రకాశ రావు : అదంతా మనల్ని బుట్టలో వెయ్యడానికే.

[తెరలో మరల — 'కాంగ్రెస్ కంటూ ఇంటింటికీ పన్నులు వసూలు చేశారు'— ఆ 'డబ్బుతో మేడ వేసుకున్నారు.— అని మాటలు బిగ్గరగా వినబడతాయి.]

ప్రకాశ రావు : ఏంచేస్తేనేం? అంత నిర్బంధం పెట్టి వసూలు చేయ డమే అతనికి గలభక్తికి నిద ర్శనం.

లక్ష్మీకాంత : ఆయనకి కాంగ్రె సంటే వెర్రి అభిమానం. కాంగ్రెసులో కాకుండా సంఘంలో వుంటానన్నందుకే కాదూ సిరిపల్లిని నేలమట్టం చేసేశాడు.

జన్మదేశ :ఎంతపట్టుదల!

లక్ష్మీకాంత : ఇదిసాగనిస్తే మా బోటివాళ్ళకింక...

ప్రకాశ రావు : కాంగ్రెసు అందరి యెడా నిష్పక్షపాతంగా వ్యం టుంది. భయపడకండి. ఇటు వంటి దౌర్జన్యాలను సాగ నియ్యం.

ఇస్మాయిల్ : ఖబడ్దార్ ! మా దేశంలోకి మీరు అడుగుపె ట్టారంటే... ఇప్పుడే చెప్తున్నా కోటిమంది హిందువుల్నీ నరికి పోగుపెడతాం.

ప్రకాశ రావు : (కోపంతో) మీ సంస్థానంలోవున్న అశాంతి దక్షి ణదేశానికంతకీ ప్రమాదం...

ఇస్మాయిల్ : దానికెవరు కారణం? మాకు రావలసిన ఆయుధాలు మీరు రానివ్వడంలేదు. లేక పోతే ఊళ్ళన్నీ తగులబెట్టేసి కనిపించిన వాడినల్లా కాల్చేసి శాంతిని స్థాపించకపోదుమా? మాకు మీరే అడ్డు.

జన్మదేశ : అబద్ధం. మా ప్రభు త్వం యుద్ధానంతరపు పోడంబడిక ప్రకారం మీకు రావలసినవన్నీ యిచ్చింది.

ప్రకాశ రావు : మా యూనియన్ లో చేరిపోతే —

ఇస్మాయిల్ : ఆమాటఅంటే మేం వొప్పుకోం...

ఒకటోగొంతు : (లౌడ్ స్పీకర్ లో)
గురవయ్యగారూ !

లక్ష్మీకాంత : పాలేగా లంజకొడు
కిక్కి 'గార'ట.

గురవయ్య గొంతుక : (లౌడ్ స్పీ
కరులో) నాపంటభూమి రెం
డెకరాలు అన్యాయంగా కలిపి
వేసుకొని నానోట మన్ను
కొట్టాడు.

ప్రకాశరావు : కోర్టులో ఎందుకు
ఏడవలేదు?

గురవయ్య గొంతు : (లౌడ్ స్పీక
ర్ లో) చూడు ఎలాపెట్టాడో
మొహం. డబ్బుందిగనక కోర్టు
లో నానోరు నొక్కేశావు.
ఇప్పుడు చెప్పు, గాడిదకొడకా!
(గంతు వేసిన చప్పుడు, తర్వాత
చెంపపెట్టు తగిలిన దెబ్బ)

లక్ష్మీకాంత : (అదిరిపడి) ఆఁ,ఆఁ,

ప్రకాశరావు : ఏమిటీ దౌర్జన్యం,
ఏమిటీ దురాగతం?

ఒకటోగొంతు : (లౌడ్ స్పీకరులో),
ఆగు ! ఆవిధంగా కొట్టడం
మనపద్ధతి కాదు. విచారణ
పూర్తికావాలి, తర్వాత ప్రజ
లు విధించిన శిక్ష నమలు
జరపాలి.

గురవయ్యగొంతు : (లౌడ్ స్పీక
ర్ లో) నిరుడు మిలిటరీ దాడు
ల రోజుల్లో నేను సంఘంలో
వున్నానని మాబాబును పోలీ
సులచేత చంపించాడు.

తెరలో గొంతులు

ఒకరు: మాయన్ననుచూపించి చంపించాడు.
రెండోవారు : మాయిల్లు తగులబెట్టిం
చాడు.
మూడోవారు : నా పశువుల్ని మంద
లోకి తోలించుకొన్నాడు.

ప్రకాశరావు : వె న క టి వ న్నీ
తవ్వుతా రెందుకు ?

జన్మదేశ : అ(నెడ్డి గూడెంలో
వీళ్ళంతా ఏకమై ఇల్లాంటివే
జరిగినవీ, జరగనివీ తవ్వుకొని
చాలమందిని చంపేటందుకు
ప్లాను వేసుకొన్నారని రిపోర్టు
వచ్చింది.

ఒకటోగొంతు : (లౌడ్ స్పీకరులో)
మరొక దుఃఖగాధ. రావుల
మ్మను తన ఆరోపణ తెల్పవల
సినదిగా పిలుస్తున్నాను.

లక్ష్మీకాంత : (తెరవంక చూస్తూ)
రావులమ్మా ? ఎక్కడో
చూసినమొగంలా వుంది.

(మీసం దువ్వుతూ) పిల్లది మంచికారులోవుంది.

ఆడు గొంతు: (లోడ్ స్పీకరునుండి వెక్కి-ఏడ్పు వినిపిస్తుంది.)

ఒకటోగొంతు: ఊరుకో అమ్మా! ఏడ్చి లాభం ఏం వుంది ?మహా జనం కూర్చుంది. నీకు జరిగిన అన్యాయాన్ని చెప్పుకో.

ఆడుగొంతుక : (వెక్కి- ఏడ్పులో) వీడు నన్ను నాశనంచేశాడు (ఏడుస్తుంది.)

జన్మదేశ : వీడుట! అమ్మా! గుడిసేటుముండ కెంతపొగరు?

లక్ష్మీకాంత : రోజులు! రోజులు!!

ఇస్మాయిల్ : ఈ కాంగ్రెస్ వాళ్ళే వీళ్ళ కింతపొగరు తెచ్చియిచ్చారు. మా ముస్లింలను బానిసల్ని చేయడానికై మీరే ప్రజల్ని రెచ్చగొట్టారు మాతోపాటుపాశం మీ మెడకి చుట్టుకుంటుంది.

ప్రకాశరావు : అందుకే త్వరగా మా యూనియన్‌లో చేరిపొమ్మనేది. అల్లర్లు అణిచేయడానికి నీలగిరి సంస్థానానికి ఇచ్చినట్లే మీకూ సైన్య సహాయం చేస్తాంగా.

ఆడగొంతు : (లౌడ్ స్పీకరు ద్వారా) ఆయన ఈడివద్ద పని చేసేవారు. ఒకరోజున చీకటి పడ్డా ఇంటికి రాలేదు. ఏడుస్తుంది)

ఒకటోగొంతు : ఊరుకో. తర్వాత ఏంజరిగింది ?

ఆడగొంతు : వెతుక్కుంటూ గడీకి బయల్దేరినా. (ఏడ్పు)

ప్రకాశరావు : ఆడది చీకటిపడ్డాక వీధిలోకి ఎందుకువచ్చింది ?

లక్ష్మీకాంత : ( పళ్ళు బిగించి ) రంకుమొగుడికోసం.

జన్మదేశ : అలాగేవుంది.

ఆడుగొంతు : (ఆగి) ఏపనోచేయడంలో ఆలస్యమైందట. నేనెళ్ళేతలికి రక్తంముద్దయ్యేలా కొట్టారు. (ఏడుస్తుంది)

[తెరలో-'వీడిని ముద్దగా చితకొట్టాలి'-, 'కాళ్లుచేతులు నరికెయ్యాలి'-అని కేకలు]

లక్ష్మీకాంత : (వొణుకుతూ) పని ఆలస్యం ఎందుకు చేయాలిసి వొచ్చింది ?

ఇస్మాయిల్ : (క్రోధంతో) ఈ దుర్మార్గానికి సరిహద్దుల అవ

తలనుంచి మీరే ప్రోత్సాహం రాసిస్తున్నారు. లేకపోతే తన్నితే పడివుండవలసిన లంజకొడుకులు మనుష్యుల్ని తన్నేరని చెప్పుకోడానికి ఎన్ని గుండెలుండాలి ?

ఆడగొంతు : ( లౌడ్‌స్పీకర్‌లో ) అక్కడికి వెళ్లాక ... (ఏడుపు)

ఒకటోగొంతు : (లౌడ్‌స్పీకర్‌లో) వీడు నిన్ను పట్టుకున్నాడా ? (పళ్ళు కొరికిన చప్పుడు)

ఆడగొంతు : (ఏడుస్తూ) మూడు రోజులతర్వాత నన్ను వదిలిపెట్టారు. ఆయన్ని కంటితో కూడ చూడలేకపోయాను (ఏడుపు).

జన్మదేశ : ఇదెవత్తో దండుముండలా వుంది. సిగ్గులేకుండా మూడు రోజులు పిళ్ళ దగ్గర పడుకున్నానని చెప్పుకుంటూంది.

[తెరలో 'చంపాలి', 'చంపాలి' అని కేకలు ]

ఒకటోగొంతు : (లౌడ్‌స్పీకర్‌లో) మట్టయ్య ఏం కేసుంటాడు?

మట్టయ్యగొంతు : (లౌడ్‌స్పీకర్‌లో) క్షమించండి.

ఒకటోగొంతు : (లౌడ్‌స్పీకర్‌లో) క్షమించడం సంగతి తర్వాత చూద్దాం. నువ్వీ దురంతాలకి ఏం చేస్తావ్ ?

మట్టయ్యగొంతుక : (లౌడ్ స్పీకరులో) అన్నీ నిజం. అబద్ధం లేదు.

జన్మదేశ : (దిగాలుగా) ఇదంతా మాస్కో విచారణల తంతు లాగ వుంది.

ప్రకాశరావు : (పళ్ళుకొరుకుతూ) మాస్కో మానసపుత్రులు, మాస్కో చేసేస్తూన్నారు.

[ తెరలో పీడని 'చంపవలసిందే'— 'ఉరి తియ్యాలి'— అని కేకలు. ]

ఇస్మాయిల్ : (ఆవేశంతో) రెండు వందల ఏళ్లుగా ప్రశాంతంగా వున్న మా నైజాంలో చిచ్చు రగిలించారు మీరే. మా దేశ వ్యవహారాల్లో కలగ చేసుకొని ప్రజాతంత్రం కావాలనీ, బాధ్యతాయుత ప్రభుత్వం కావాలనీ మీరే అల్లర్లు చేశారు. దీనికి...

ప్రకాశరావు : (కోపం, ఆవేశంతో) మీ దేశంలో, మీ యిష్టం వచ్చినట్లు తగులడండి. బాధ్యతాయుత ప్రభుత్వమో, ప్రజాతంత్రమో అది మీ

స్వంత వ్యవహారం. మాకు కావలసింది శాంతి...

ఇస్మాయిల్ : మీకు పరిపాలన చేతగాదు. ప్రజల్ని రెచ్చగొట్టి అనవసరంగా అల్లరులు తెస్తున్నారు. మా దత్తమండలాలూ, సర్కార్లూ మాకు పారెయ్యండి! శాంతి ఏర్పరుస్తామో లేదో చూపెడతాం.

[తెరలో "ఉరి! ఉరి తియ్యాలి" అని కేకలు]

జన్మదేశ : ఇద్దరూ త్వరలో వ్యవహారం ఓ కొలిక్కి తేలేకపోతే యిద్దరికీ కూడా ప్రమాదం వుంది.

ప్రకాశరావు : (కోపంతో) మీ రాజ్యంలో యేమి చావండి! శాంతి-శాంతి నెలకొల్పాలి లేదా...

ఇస్మాయిల్ : మా శాయుధాలూ దత్తమండలాలూ, శవాలు పారవేసేటందుకు సముద్ర తీరం రేవులూ ఇవ్వాలి. లేకపోతే...

[తెరలో 'ఉరిశిక్ష విధించాలి' 'తుపాకికి కాల్చెయ్యాలి' 'ఒక గుండుదండగ'... 'రాళ్ళతో కొట్టి చంపాలి'... అని కేకలు]

ప్రకాశరావు : (కంగారుగా లేచి) మీ దుష్పరిపాలన వలన మీ రాజ్యంలోనే గాక, దక్షిణ దేశం అంతటా ప్రజలు యీ విధముగా రక్తదాహంతో బయలుదేరేటట్లున్నారు. మీరు శాంతి నెలకొల్పాలి. (చేయిచాపి) ఇటువంటి దౌర్జన్యాలను నిలపాలి. లేదా శాంతి రక్షణకు, ప్రజల ప్రాణాల భద్రతకు మా యూనియన్ సేనలు దాడి చేస్తాయి. ఖబడ్దార్ !

[తెరలో "ఉరి!" ఉరి!" అని ధ్వనులు]



# 'మాభూమి' ప్రదర్శనపై మద్రాసుప్రభుత్వ నిషేధం

## కళాశీలురు, విజ్ఞానవేత్తలు ఈ నిరంకుశ చర్యను ఖండించాలి

## 1

'మాభూమి' గ్రంథకర్తలు శ్రీ సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావుగార్లు ఇలా ప్రకటిస్తున్నారు—

మద్రాసు ప్రభుత్వం మాభూమి నాటక ప్రదర్శనాన్ని నిషేధించింది. ఇది ప్రజల మతులను చెడగొడుతుందనుకొని నిషేధించానంది. పూర్వం బ్రిటిష్‌వాళ్ళు అడుగులకు మడుగులొత్తే, అడ్వయిజరీ ప్రభుత్వం మా 'ముందడుగు' నాటక ప్రదర్శనాన్ని నిషేధిస్తూ ఇలాంటిసాకే చెప్పింది. అప్పుడు దానికి, ముకాసాదార్లు, జమీందార్లు ఏదో మేత వేసారనుకున్నాం. ఇప్పుడు మా నాటకప్రదర్శనాన్ని నిషేధించింది కాంగ్రెసు ప్రభుత్వం. దీనికేమనుకోవాలి?

ఈ నాటకం అనేకమంది ప్రముఖుల మన్ననలను పొందింది. అందులో కొందరి అభిప్రాయాలను ఇక్కడ క్లుప్తంగా పొందుపరుస్తున్నాం.

"నాటకాన్ని రచయితలు చక్కగా రచించారు. భూత భవిష్యత్కాలాలను దృష్టిలో ఉంచుకొని రచయితలు ఈ నాటకంద్వారా చక్కని ప్రబోధం కలిగించినవారయ్యారు. ఈ నాటకం నన్ను తన్మయుణ్ణి చేసింది."—హరినాగభూషణం

"నాటకంలో రచయితలు సోదర తెలుగు ప్రజల బాధలను, అద్భుతంగా చిత్రించారు"

— మునిమాణిక్యం నరసింహారావు.

"మాభూమి తెలంగాణా ప్రజలలో అసమర్థతను పారద్రోలి, తెలంగాణాలో ఒక విప్లవజ్యోతిని వెలిగించుతోంది. ఆంధ్ర నాటకరంగంలో ఒక కొత్తశకం ప్రారంభమైంది". —కొప్పరపు సుబ్బారావు.

"ఈ నాటకరచన కొద్దిలో మిక్కిలి అందంగా ఉంది. ఇందులో అచ్చమైన తెలుగు జాతీయం కుప్పలుకుప్పలుగా ఉంది ...ఈ 'మాభూమి' లో ఉన్న భాష తెలుగు గడ్డలో పుట్టినభాష. 'ఆ పిల్ల నెత్తిన ముంతో చిట్టెడు గింజలు పడేదాక, నాకేం తోచదు' ఇల్లాంటి మాటలు ఎన్ని ఉన్నవో చెప్పలేను... ఈ కవులు చిరాయుష్కులయి ఇల్లాంటినాటకాలు ఇంకా రాయాలని, జాను తెలుగు తల్లికి హారతు లెత్తాలని ఆశిస్తున్నాను".

— విశ్వనాథ సత్యనారాయణ

"రచనలో విమర్శకు తావులేదు. నగారాబాడేసమాసాలే, కవిత్వం అనుకునే వారికి ఎంతమందికి ఈ జాతీయమైన తెలుగు తెలుసు! ఈ కవులు Idiom చాలా బాగా పట్టుకున్నారు. వీరి రచనలు చూశాక, మేం కవులమని చెప్పుకోవడం సిగ్గుగావుంది. తిక్కన్న తర్వాత మళ్ళీ ఈ నాడు జాతీయమైన భాష విన్నాం. అలాంటి తెలుగు ఔన్నత్యం, పునరుద్ధరించ బడుతూందని ఈ కవులు రుజువుచేశారు. రైలుబండినడకలాగా ఈ కవులు సంవాదము బహు చక్కగా నడిపారు. బీదరైతుల బాధలు చిత్రించారు. నైజాంలో దేశముఖులకు ఇంకా గోరి కట్టలేదు. కాని ఇందులో కట్టారు. రామాయణం వాల్మీకి ముందుగానే గానం చేశాడు నిజమైంది. అలాగే యీ సత్య కవుల వాక్కు త్వరలో ఫలిస్తుందని నమ్ముతున్నాను"

— పింగళి లక్ష్మీకాంతం.

"ఇంతవరకు అనేకమందిమి అనేక నాటకాలు చూశాం. కాని నా ఉద్దేశంలో అవేవీ నాటకాలుమాత్రం కావనీ, ఇదొక్కటే కళాన్వితమైన నాటకమనీ నా అభిప్రాయము" — లింగమూర్తి.

"ఆంధ్రప్రజానాట్యమండలివారు ప్రదర్శించిన 'పరివర్తన' 'మాభూమి' నాటకాలను చూశాను. ఈ నాటకాలు రెండు రెండే... ఈ ప్రదర్శనాలు నేను మరువలేనివి" (ఆంధ్రప్రభ 7-12.47)

— మల్లంపల్లి సోమశేఖరశర్మ.

"ఈ నాటకం చూశాక ప్రతి నాటక కర్తా ప్రజలనింతగా ఆకర్షించేలాగునూ, మంత్రముగ్ధుల్ని చేసేవిధంగానూ వ్రాయ కలగాలని కోరుకోవాలి."

— నార్ల వెంకటేశ్వరరావు.

"సోదర తెలంగాణా ప్రజలు అష్ట కష్టాలూ పడుతున్నారు. దుర్భర పరిస్థితులను లోనౌతున్నారు. వీటినుంచి బయట పడాలంటే మనలో ధైర్యసాహసాలు రేకెత్తాలి. దానికీ నాటకం మహత్తరంగా పని చేస్తుంది."

— గాడిచర్ల హరిసర్వోత్తమరావు

"ఎటువంటి సాంఘిక నాటకం ఆదర్శ ప్రాయమో, దేనికొరకు నేను ఇంత కాలము నుంచీ కలలుగంటున్నానో, అటువంటి నాటకాన్ని ఈనాడు చూడగలిగినందుకు నాకు చాలా ఆనందంగావుంది. శ్రీ గురజాడ అప్పారావుగారే ఈనాటకాన్ని చూచిఉన్నట్టయితే, 'తాముపడ్డ కష్టాలన్నీ ఫలించినాయి' అనివుండేవారని నాభావం"

గిడుగు సీతాపతి.

ఇలాంటి సుప్రసిద్ధ రచయితలు, కవులు, గాయకులు, పండితులు, శాస్త్రవేత్తలు, కళారాధకులు, మతులుచెడబట్టే ఈ నాటకాన్ని ప్రశంశించారందామా ?

బెజవాడలో మన అమాత్యశేఖరులైన శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్యక్షాన నాట్యకళా పరిషత్సభలు జరిగాయి. 'మాభూమి' నాటక ప్రదర్శనం కూడా జరిగింది. నాట్యకళా పరిషత్తువారు దీనికి ప్రథమ బహుమానం ఇచ్చారు. అయితే వారికీ మతిపోయిందన్న మాటేనా ?

తెలుగుదేశంలో మొత్తం 128 దళాలు యీ నాటకాన్ని ప్రదర్శిస్తున్నాయి. షుమారు ముప్ఫైలక్షల ప్రజలు దీన్ని చూచివుంటారు. వీరందరికీ మతులు చెడేయున్న మాటేనా? ఎంత న్యాయం! ఇంతకంటే అసలు తెలుగుదేశానికే మతిపోయిందంటే బాగుండేదేమో !

ప్రజా నాట్యమండలి వారు ఈ నాటకాన్ని బొంబాయి, పూనా, షోలాపూరు, అలాంటి పట్టణములలో కూడా ప్రదర్శించారు. బొంబాయిలో అహమ్మద్ అబ్బాస్ బలరాజ్ సహాని మొదలయిన ప్రముఖులు ఈ నాటకాన్ని చూచి ఆనందించారు. "ప్రపంచంలో 128 దళాలు ఇంతవరకు ఏ నాటకాన్ని ప్రదర్శించలేదు. ఇది వరల్డు రికార్డును బ్రేకుచేసింది. అని వ్రాశారు. అహమ్మద్ అబ్బాస్ పూనాలో, షోలాపూరులో ప్రముఖ కాంగ్రెస్ నాయకులుకూడ ఈ నాటకాన్ని అభినందించారు." ఇలాంటి నాటకాలు మాభాషలోకి కూడ రావాలన్నారు.

అయితే ఈ సుప్రసిద్ధపత్రికాసంపాదకులకు, కళారాధకులకు కాంగ్రెస్ నాయకులకు కూడమతిభ్రమ కలిగిందంటారా? కనుకనే ఈనాటకాన్ని ప్రశంశించారంటారా?

మరిచాం. నేటిప్రభుత్వంలోని ఆంధ్ర మంత్రి పుంగవులు కొందరు ఈ నాటక ప్రదర్శనాన్ని మదరాసులో చూచారుగా! చూడటమేగాదు. ఆనందించి అభిప్రాయాలిచ్చారు కన్నీరు కార్చామన్నారు. ఇలాంటి నాటకాలింకా రావాలన్నారు. దీని ఆదర్శాన్ని అందరు పట్టాలన్నారు. అప్పుడు వీరుమతులుచెడిపోబట్టే అలా సెలవిచ్చారందామా? అయితే ఇప్పుడు ఏ ఔషధం సేవిస్తే ఆచెడిపోయిన మతులు కుదుటపడ్డాయో!

ఇది మదరాసుప్రభుత్వం మానాటకం పైన వేసిన అభాండమో! లేక అదినిజంగా ప్రజల మతులను చెడగొడుతుందో నిర్ణయించాల్సింది ప్రజలూ, ప్రాజ్ఞులూ. కనుక అది వారికే వదిలివేస్తున్నాం.

ఈనాడు కాంగ్రెసు ప్రభుత్వం పేద రైతులమీద, కూలీలమీద దాడి చేస్తూ ఉంది. అలాగే కవికలంమీద, గాయకుని కంఠంమీద నటకుని నటనాకౌశలంమీద చిత్రకారుని కుంచెమీద విరుచుకు పడింది. పరాయిపాలన అంతరించిందనీ, ప్రజా ప్రభుత్వం వచ్చిందనీ ఆశించాం. కాని అది పగటికలగా మారింది. ఇదివరకు ప్రపంచంలో ఒక్క ఫాసిస్టుప్రభుత్వంతప్ప మరే ప్రభుత్వం కళలమీద దాడులు చేయలేదు. ఇది మనకూ, మనదేశానికీ తీరని కళంకం. మాయనిమచ్చ.

స్వతంత్రాభిలాషులైన కవులు, గాయకులు, కళాకారులు, పండితులు ప్రజలు, తమ కర్తవ్యాన్ని గుర్తించి వెంటనే ముందుకు వస్తారని, ఇలాంటి క్రూరనిరంకుశ నిషేధాలను తీవ్రంగా ఖండిస్తారనీ మేమాశిస్తున్నాం.

# 2

## 'మాభూమి'ని లక్షలాదిప్రజలకు ప్రదర్శించిన ఆంధ్రప్రజా నాట్యమండలి కార్యదర్శి రాజారావుగారిలా ప్రకటిస్తున్నారు.

బ్రిటిష్ గులాములైన సంస్థానాధీశ్వరుల నిరంకుశ క్రూర పరిపాలనను నిలువెల్ల నిర్మూలనచేయ రచింపబడిన - సోదర తెలంగాణా ప్రజల వీరోచిత పోరాటగాధ: 'మాభూమి' నాటకం. ముందడుగు, అపనింద నాటకాలను రచించిన శ్రీ సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావు గార్లు దీన్ని రచించారు.

ఆంధ్ర ప్రజా నాట్యమండలి, నూటయిరవై అనుబంధ శాఖలు 980 ప్రదర్శనల ద్వారా 18 లక్షల ప్రజానీకానికి 'విశాలాంధ్ర' దున్నేవానికే భూమి హక్కు అనే సందేశాన్ని అందించారు.

శ్రీ విశ్వనాథ, పింగళి లక్ష్మీకాంతం లాంటి కవులు శ్రీ లింగమూర్తి, గిడుగు సీతాపతిలాంటి నటులు శ్రీ శాంతారామ్, ప్రసాద్, బి. యన్. రెడ్డి లాంటి దర్శకులు యింకా యెందరో మేధావులు, చిత్రకారులు, శిల్ప వేత్తలు వేనోళ్ళ కొనియాడారు.

పూనాలో 'మాభూమి' ప్రదర్శన చూచి "నైజాం నిరంకుశత్వానికి తెలుగు ప్రజలేగాక మహారాష్ట్ర ప్రజలుకూడా గురయ్యారు. మహారాష్ట్ర కళాకారులు కూడా యీ సమస్యను తీసుకుని తమజాతికి తోడ్పడాలి" అని శ్రీ జథే యం. యల్. ఏ., శ్రీ జి. ఎ. దేశపాండే, మహారాష్ట్ర కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి సందేశాలిచ్చారు.

అంతేగాక ఆంధ్రనాటక కళాపరిషత్ 14 వ సమావేశంలో 'మాభూమి' ప్రదర్శన రెండవ బహుమతిని రచన ప్రథమబహుమతిని పొంది మరోసారి తన కళాకాంతిని లోకానికి చాటింది.

మద్రాస్ నగరంలో, అందులో బాంక్వెటింగ్ హాలులో కూడా ప్రదర్శింపబడింది. ప్రదర్శనచూచిన మంత్రులు శ్రీ గోపాలరెడ్డి "నిద్రాణమైవున్న జాతి నేడు నిద్ర మేల్కొంటున్నది." అని ప్రశంశించి, అర్ధ నూటపదహార్లు బహూకరించారు. అమాత్యులు శ్రీ కళావారు, కూర్మయ్యగారు వేనోళ్ళకొనియాడి "వాడవాడలా" ప్రదర్శింపబడా" లన్నారు.

ఆరునెలలు గడవలేదు. ఆమంత్రుల పరిపాలనలోనే 'మాభూమి' నాటకానికి కాలదోషం పట్టింది.

## నిషేధానికి సాకు

'మాభూమి' ప్రదర్శనం ప్రేక్షకుల మనస్సులు పాడుచేస్తుందని బాణం సంధించింది ప్రభుత్వం. 20 లక్షలమంది ప్రజానీకం, ఎంతోమంది కవులు, గాయకులు, నటకులు, దర్శకులు విజ్ఞానవేత్తలు అందరి మనస్సులు పాడయ్యాయా!

మనస్సులు పాడు చేసుకొమ్మనే యీ ప్రభుత్వమంత్రులు "వాడ వాడలా ప్రదర్శించండ"న్నారా?

ప్రదర్శనచూచి ఆనందించి అభినందించిన నేటి మద్రాసుమంత్రుల మనస్సులు ఏమయ్యాయి? (పాడయ్యాయా)

## ప్రజాస్వామ్యవాదుల కర్తవ్యం:

మాభూమి నాటక ప్రదర్శనాన్ని నిషేధించడం ప్రజానాట్యమండలికే గాక అభ్యుదయ కళాకారులకు, నటకుల కొక సవాల్. ప్రజాస్వామ్య రక్షణ కొకపరీక్ష.

కాబట్టి కవులు, గాయకులు, చిత్రకారులు, నటకులు, దర్శకులు, విజ్ఞానవేత్తలు ప్రజాసంఘాలు, ఒక కమిటీ—ఆంధ్ర ప్రజానీకమంతా మాభూమి ప్రదర్శనపై నిషేధం తొలగించేవరకు ఆందోళన చేయడం తమ విధిగా భావించాలి. సభలు, సమావేశాలు జరిపి నిషేధాజ్ఞను ఖండించాలి. ఈ సందర్భంలో పత్రికా సంపాదకులు, ఆంధ్ర ప్రజానీకం చేయూతనిస్తారని ఆశిస్తున్నాం.



# ఆశాజ్యోతి



తెలంగాణ ప్రజోద్యమం
భరతజాతి ఆశాజ్యోతి!

తెలంగాణ వీరవరుల
గుండెల్లో దూరిన ప్రతిగుండూ
పీడిత భారత జాతికి
ఒకొక్కటి
ఒకసవాలు!

ఆపవిత్ర సమరంలో
ఒరిగే ప్రతివీరుడు
ఆసేతు హిమాచలంగల
శ్రామిక దాస్యవిముక్తికి
మరణించిన
అమరజీవి!

— చావలి రామచంద్రరావు

ఏ. సోమసుందర్

# విశ్వరూపం!



అతడెవరు ?... అతడెవరు?
జనగామలో జన్మిం
కొమ్మపై ఎక్కాడు...
అతడెవరు ?... అతడెవరు?
గాండీవమును వెదకు
విజయుడలె నున్నాడు...
అతడెవరు ?... అతడెవరు?

అతడా? - తెలంగాణ
గెరిల్లాల నాయకుడు...
అతడే— ప్రజాసమర
ఉద్యమోత్సాహకుడు
అతడే —ప్రజాస్వామ్య
జగతి కధ్యాపకుడు,
అతడే — తెలంగాణ
గెరిల్లాల నాయకుడు!

పాంచ జన్యమ్ము
పూరించు చున్నాడదే!
-సమరోత్స వమ్మువలె...
-భూమాత పిలుపువలె...
కొమ్ముబూరాను
పూరించు చున్నాడదే!—

"శత్రువులు, శత్రువులు
శత్రువులు వస్తారు...
ప్రజలు నడుములుకట్టి
నిలువండి - గెలువండి..."

పుడమి గర్జించింది!
పుడమి గర్జించింది!!
శత్రువులు, శత్రువులు
శత్రువులు వచ్చారు.
శత్రువులు జనగామ
ముట్టడిస్తున్నారు...
పెట్రోలుతో ఇళ్లు
తగుల బెడుతున్నారు...
అధునిక ఆయుధాల్
దాడిచేస్తున్నాయి.

పుడమి గర్జించింది!
పుడమి గర్జించింది!
ఇంటికొక మానవుడు
వీరుడై పొంగాడు!
రాక్షసుల కంఠాలు:
మానవుల ఖడ్గాలు!

మానవుల మానాలు:
ముష్కరుల దాహాలు!

తెల్ల నెత్తురుత్రాగి
కైపెక్కి బొబ్బలులు...
స్వేచ్ఛామృతము గ్రోలి
మైమరచు దేవతలు...
నరమాంసమును ఒలిచి
భక్షించు రాక్షసులు...
విప్లవాగ్ని నిరగిలి
చేవెక్కి దేహాలు...
ఘోరమై భీభత్స
రూపమై, జనగామ!
రక్తమై, పైశాచ
భుక్తమై, జనగామ!!
నరరూప రక్కసులు
క్రకచాత్మ కర్కశులు

పసికందు గుండెలను
పిండి పీల్చేస్తారు—
మిసిమియువతుల; ఉ
రోజముల చీల్చేస్తారు—
నరరూప రక్కసులు!
క్రకచాత్మ కర్కశులు!!
పుడమి గర్జించింది!
పుడమి గర్జించింది!
ఇంటికొక మానవుడు,
యోధుడై నిలచాడు!!

శ్రమిక జాతికి శిరో
మణులు దీపించారు
పుడమితల్లికి తనువు
పులకరించింది!

వీరుల సమూహమై
కదిలింది జనగామ.
విప్లవప్రవాహమై
పొంగిందిజనగామ.

రైతులూ, కూలీలు
బాధితులు, పీడితులు
రణయోధులై మహా
శక్తి చూపిస్తారు!
పుడమి గర్జించింది
పుడమి గర్జించింది
పుడమి, వీరులతల్లి
పులకరించింది.

అతడెవరు ?... అతడెవరు?
ప్రళయ కాలమహా
రుద్రుడై - అతడెవరు ?
తాండవ జటాజనిత
భద్రుడై - అతడెవరు ?
ఊరికాడు, జనగామ
గెరిల్లాల నాయకుడు
అతడే! - తెలంగాణ
గెరిల్లాల నాయకుడు.

అతడే! - తెలంగాణ
గెరిల్లాల నాయకుడు.

తిండితిప్పలు లేవు,
ఎంతటి మహాశక్తి!
లేదసలె విశ్రాంతి
ఎంతటి మహాశక్తి!
హత్యను జయించాడు
మృత్యువు జయించాడు
'ప్రజాస్వామ్య' మనేటి
అమృతము తాగాడు,
అమర వీరుండతడు,
మృత్యువు జయించాడు!
హత్యను జయించాడు!
ప్రజావాహిని, ఎదురు
దాడులకు సిద్ధమై

సాయుధ తరంగాల
ఉరకలై పొంగింది.

ప్రజలందరూ, ముందు
కురికారు, విజయులై!
ఈటెలూ, బల్లెములు
నాటు బందూకులు-
రోకళ్లు, కారాల
మూటలతో కదిలారు?
కూల్చారు, రక్కసుల...
గెల్చారు, శత్రువుల...
ఎంతటి మహాశక్తి?
మృత్యువు జయించారు!
హత్యను జయించారు!!
జనగామలో విజయ
భేరి మ్రోగించారు.—

కథ

# 'నీ కాలు మొక్కుతా! నీ బాంచని!'

— శ్రీ కొడవటిగంటి కుటుంబరావు —

ఆరోజుల్లో రంగారావు ఆరితేరిన రాజకీయవేత్త. నాబోటి నిస్తేజప్రాణులకు సహితం ప్రాణంపోసేటట్టుమాట్లాడేవాడు. ఆరోజుల్లో అతను వేదిక మీదికిఎక్కి "మన పట్టాభిగారు, మన ప్రకాశంగారు, మన కళాగారు, మన నడింపల్లి నరసింహారావుగారు" అనిదంచి మాట్లాడేస్తుంటే నాకు అసూయగాఉండేది. అవన్నీ కోతలుకావు కూడాను. కాంగ్రెసు జిల్లా, రాష్ట్ర ఎన్నికల సందర్భాలలో రంగారావు పెత్తనంకూడా ఉంటూఉండేది. అతనికి అన్ని విషయాలూ ముందుగా తెలుస్తూ ఉండేవి.

ఉప్పుసత్యాగ్రహంలో జైలుకువెళ్ళి బయటికొచ్చాడు రంగారావు. నేను ఉదరనిమిత్తం నైజాము రాజ్యం వెళ్లుతూంటే నావెంట రంగారావు కూడా వచ్చాడు. అక్కడ అతని బంధువొకాయన హనుమకొండలు వైద్యుడుగా ఉంటుండేవాడు. ఆ ప్రాంతం చూడటం మాకిద్దరికీ అదే కొత్త

"ఏమిటోయ్, వీళ్లంతా ఇంత బైతుముండా కొడుకులేం?" అన్నాడు రంగారావు. అక్కడ తెల్ల గుడ్డ వేసుకున్నవాడు దేశముఖుతో సమానం. ఇంగ్లీషు మాట్లాడేవాడు దొరతో సమానం. అక్కడి సుబేదారుతో తప్ప మిగిలినవారందరితోటీ మాకు పరిచయం అయింది. అన్వర్ సాబూ, దువ్వాం సాబూ, సెషన్సు జడ్జీ, అమీన్ సాబూ ఇంకా ఎవరెవరో మాకు షేక్ హాండు ఇచ్చిస్వర్గంనుంచి

ఊడిపడ్డట్టుచూశారు. మాఇంగ్లీషు బాగుంటుందనీ, తమ ఇంగ్లీషు బాగుండదనీ అన్నారు. ఈ బొల్లి కబుర్లు నేను నమ్మలేదుగాని రంగారావునమ్మేశాడు. ముఖ్యంగా జైలుసూపర్నెంటు దొరతో సమంగా ఇంగ్లీషు మాట్లాడతాడు. ఆ విషయంకూడా రంగారావు గమనించలేదు.

వీళ్లంతా మమ్మల్ని గొప్పగా చూడటమూ, మామూలుమనుష్యులు మాతోమాట్లాడేటప్పుడు, "నీ కాల్మొక్కుతా ! నీ బాన్చని !" అని అడుగడుగునా ప్రాధేయపడటంచూసి రంగారావు తానేదో బ్రహ్మాండనాయకుణ్ణనుకున్నాడు. పదిరోజులుండి రంగారావు తనదారిన తనువెళ్లాడు. నాలుగునెల్లు అక్కడ ఉండిపోయినవాణ్ణి నేనూ. నాకు తెలుసును ! రంగారావు వెంటనిజాంపోలీసొకడు ప్రతిరోజూ తిరిగాడని. ఆపోలీసుకూ నాకు స్నేహమయింది. రంగారావు వెంట తిరిగిన సంగతి నాతో వాడే చెప్పాడు. రంగారావు నేను బస్సు దిగిన గంటకల్లా అతను కాంగ్రెసువాడని పోలీసు వాసనపట్టేశాడు

రంగారావు అక్కడఉండగానే మరొక విషయం జరిగింది. ఒకనాడొక కుర్రవాడువచ్చి రహస్యంగా ఫలానిచోట చిన్నమీటింగు జరుగుచున్నది రమ్మనిమాకిద్దరికీ ఆహ్వానం అందించిచాడు. ఏం మీటింగంటే మామూలు మీటింగేనన్నాడు. మీటింగుకు వెళ్లాం. అంతా పదిపన్నెండు మంది వచ్చారు. అది కాంగ్రెసు మీటింగు. ఆసంగతి తెలియగానే రంగారావు నిరుత్సాహపడ్డాడు.

"కాంగ్రెసు మీటింగు ఇట్లా చేస్తారా? ఈరహస్యమేమిటి? ఈపదిమంది మధ్యా ఈతీర్మానాలేమిట్టి? ఇవి ఎవరికందుతై? ఎవరు వీటిని అమలుజరుపుతారు ? మేం మీటింగు చేస్తే వేలకువేలు చేరుతారే ?" అంటూ రంగారావు తన సహజ ధోరణిలో వాళ్లకి వేడి ఎక్కించాడు. వాడిమాటలంతా ఆత్రంగా విన్నారు.

"ఈడ మీటింగంటె మంది వచ్చేదిలేదు. ఎవ్వరికీ బయమే

కాంగిరెసని ఏనాడైతె పెట్టినామో నాటినుంచి ఇట్టనె చాలా అయి తండది" అని అక్కడివాళ్లు మాకు తెలియజేశారు.

ఇంటికి వస్తూ రంగారావు నాతో "ఎబ్బే! వీళ్ల మొఖం! వీళ్లకి రాజకీయ చైతన్యం ఎక్కించటానికి కనీసం ఒక శతాబ్దం పడుతుంది. స్వాతంత్ర్యమంటే ఏమిటో తెలి యాలంటే అధమం రెండు శతా బ్దాలు పడుతుంది! మనమేదన్నా వీళ్లకి సాధించి పెడితేకద్దు, లేక పోతే లేదు. ఎబ్బే వొట్టి గొడ్డు ముండా కొడుకులు!" అన్నాడు.

రంగారావు వెళ్లిపోయినాక నేను అతని చుట్టమైన డాక్టరుగారి స్నేహంగాని, మిగిలిన గొప్పవాళ్ల స్నేహంగాని ఆశించలేదు. నాకు స్నేహమైన వారంతా అక్కడ చిన్నచిన్న ఉద్యోగాలు చేసుకునే వాళ్లు. అందులో కొందరు సాయి బులుకూడా ఉండేవారు. ఒక సాయిబు నాకు ఉర్దూ అక్షరాలు రాయటమూ చదవటమూకూడా నేర్పాడు.

ఆసాయిబు స్నేహితుణ్ణిచూస్తే నాకుచాలాసంతోషంగా ఉండేది. అతని ప్రవర్తన అతి నిర్దుష్టంగానూ అతి వినయంతోకూడుకునిఉండేది. ఇంత వక్కపలుకు యిచ్చినా రెండుచేతులతోటీ అందుకుని లేచి నిలబడి, దాన్ని కళ్లకు మూడు సార్లు అద్దుకుని "షుక్రియా" అని మళ్లా కూర్చునేవాడు. బీడీకి నిప్పు అందించినా ఇదేవరస. అతని విష యంలోఒకచిక్కుగాకూడాఉండేది ఈ వినయం నేనెక్కడ నటించ గలను? నన్ను అతను మొరటు మనిషికింద చూస్తాడేమోనని.

మాకు ఇటువంటి అలవాట్లు లేవు. నన్ను అపార్థం చేసుకోవ ద్దని అతనితో అందామని ఎన్నో సార్లు నోటిదాకా వచ్చింది. కాని తీరా అనబుద్ధి అయేదికాదు. ఎందు కంటే నా అంతరాత్మలో నిజంగా ఆతని ప్రవర్తనమీద నాకు గౌర వంలేదు. అతను జమీందారీ నాగ రికతకు బానిస. ఆసలాములూ, గుంజీలూ ఉంటేగాని అతని ఆత్మ గౌరవం నిలవదు. అతని ఆత్మగౌ రవమంతా దానిమీదనే ఆధార

పడి ఉంది. మరి నేను చూసిన "బడాసాబు" లంతా ఇంతే. నూటికి పదిమందో, పన్నెండుమందో ఉన్న ఈసాయిబులు మిగతావాళ్ళచే "నీకాల్మొక్కుతా" అనిపిస్తున్నారంటే ఆ బానిసత్వం ఈ పది పన్నెండు మందికీ సోకకుండా ఎట్లా ఉంటుంది ?

అక్కడ నేనున్నది నాలుగు నెలలేకాని ఈ నాలుగునెలలూ అయిపోయ్యేలోపుగా నేను స్వేచ్ఛకోసం పరితపించ సాగాను. బ్రిటిషువాళ్లు మనని దాస్యంలో ఉంచారని పెద్దలు చెప్పగా వినట మేగాని ఆదాస్యం స్వరూపమే మిటో అంతకన్న స్వేచ్ఛగా ఎట్లా ఉండవచ్చునో నాకెన్నడూ తెలియలేదు. నేను ఏ ఇంగ్లండో అమెరికావో పోయి అక్కడ జీవితం చూసి ఉంటే నా దాస్యస్థితి అర్థం చేసుకుని ఉండేవాణ్ణేమో. నిజాము రాజ్యం చూసినాక బ్రిటిషువాళ్ల పరిపాలన లక్షరెట్లు మెరుగని పించింది.

ఈనిజాము రాష్ట్రం వాళ్ళకి ఏ హక్కులూ లేవు. పోలీసులకి విపరీతమైన అధికారాలు. ప్రతి పోలీసు వాడూ గూఢచారుడే. ప్రతి కూలివాడూ వెట్టివాడే. గ్రామాలున్నాయంటే దేశముఖు రాజు. లేకపోతే అమీన్‌సాబు నవాబు. వాళ్లతరవాత పటేళ్లు సర్వాధికారులు. అధికారులు ప్రజలను బహిరంగంగా దోచుకోవడమే పరిపాలన. వరంగల్ వంటి సుబాలో కూడా కచ్చేరీలలో ఉద్యోగస్తులు నవాబు దర్జా వెలిగిస్తారు. తాంబూలం వెయ్యటమూ, బీడీలు కాల్చటమూ, "ఘూన్ దాన్"లో ఉమ్మటమూ వాళ్లపని. అడిగే నాథుడు లేడు. లంచాలు పట్టని అధికారి వింతమనిషి. అవ్వల్ సాబ్ లంచాలు పట్టడని ప్రతీతి. అంటే పదివేలకు తక్కువ పట్టడట! నిజాములో కొందరు పెద్దలు నవాబు గారికి అర్జీపెట్టుకుని సాయిబులతో సమంగానైనా హిందువులకు ప్రభుత్వోద్యోగాలిప్పించ వలసిందని అర్జీ పెట్టుకున్నారట. ఆ అర్జీ నేనక్కడ ఉన్నరోజుల్లో నే బుట్టదాఖలయిందని విన్నాను.

ఈ విషయాలన్నీ చెవినిపడ్డయే గాని నాకు నిజంగా పట్టలేదు. నన్ను బాధించిన దల్లా అక్కడ ఎవరిదగ్గరా మంచి పుస్తకాలు దొరకవు. ఎవరితోనూ పెద్ద విష యాలమీద చర్చించటానికి లేదు. అక్కడ నాకు కావలసిన సం స్కారము లేదు. మాఊళ్లో ఉద్యో గం లేకుండా తిరిగినా ఆగాలి పీలి స్తేనే చాలు. సాయంకాలం రెండు మూడు గంటలు క్లబ్బుకో పార్కు కో పోతేనే చాలు. జీవితం ధన్య మవుతుం దనిపించింది. నిజాము రాజ్యం వొదలివేసి వచ్చేశాను

"నీకు ముల్కీ సర్టిఫికట్టు సంపా దిస్తాను. ఇక్కడే ఉండిపో!" అని నా సాయిబు మిత్రుడు చెప్పాడు. వద్దన్నాను.

ఏళ్లు గడచినై. యుద్ధంవచ్చింది. నేను యుద్ధ సహకారం చేసిన వాణ్ణయినాను. రంగారావు ఆగస్టు హీరో అయినాడు. తదనంతరం నేను నిరుద్యోగి నైనాను. రంగా రావు లాభసాటి వ్యాపారస్థు డైనాడు.

నాకు రాజకీయాల్లో ఆశక్తి లేదంటే రంగారావు నమ్మడు. నాకు పెట్టుబడి దారీలో విశ్వాసం లేదనీ, రష్యాఅంటే అభిమానం ఉందనీ రంగారావుకు తెలు సును చాటుగా నేను కమ్యూ నిస్టుననీ, కమ్యూనిస్టులు నన్ను మాయమాటలతో బుట్టలో వేసు కున్నారనీ రంగారావుఅనుమానం. నేను దరిద్రుల పక్షం మాట్లాడినా కూలివాళ్ల పక్షం మాట్లాడినా, అతను సమ్మెలను గురించి నిర సిస్తూ మాట్లాడితే నేను ఒప్పు కోక పోయినా రంగారావు అను మానాలు బలపడుతూ ఉంటాయి. నా సంస్కారానికి ఒక రాజకీయ బురఖా వేసి నా చేతిలో ఒకజండా పెడితే తప్ప రంగారావు అంత రాత్మకు శాంతి లేనట్టు కనబడ్డది. అప్పటికీ ఒకసారి స్పష్టంగా చెప్పే శాను:

"నువ్వూ కావటానికి, స్వాతం త్ర్యప్రియుడివేగాని, పెట్టుబడిదారీ విధానం సంఘానికి మంచిదికాదనీ రష్యాలో ఇంకేమీ లేకపోయినా అందరికీ చేసుకునేటందుకు పనీ,

తినేటందుకు తిండీ, కట్టగుడ్డా ఉందనీ అనుకునే స్వేచ్ఛ నాకుండ రాదని నీవిశ్వాసం. నీవిశ్వాసానికి ఆధారమేమిటో నాకు తెలియటం లేదు. మాయమాటలతో నన్ను ఏ కమ్యూనిస్టులో బుట్టలో వేశా రంటున్నావు. నా స్నేహితుడివి గనక నామంచికోసం నువేందుకు నన్ను నీబుట్టలో వేసుకోవూ?" అని రంగారావు నడిగాను.

ఇట్లా అడిగే అధికారంకూడా నాకుండ రాదన్న మొహంపెట్టాడు రంగారావు.

అయితే రంగారావు రాజకీయ విశ్వాసాలు రంగారావుకు సంపూర్ణమైన మనశ్శాంతి నివ్వలేదు. అతనికి ఆంధ్రరాష్ట్రం గురించి గట్టి అభిప్రాయాలుంటూ వచ్చినై. ఆంధ్రరాష్ట్రం వచ్చితీరాలి. ఆంధ్ర రాష్ట్రం కోసమైనా తెలంగాణాను నవాబునుంచి గుంజుకోవాలి. రాజకీయంగా, పాపం, మనకాంగ్రెసు వాళ్లు నిజాముప్రభువు సమస్య తేల్చలేనిస్థితిలో ఉన్నారు.

"అయితే ఏంలే? 'నీకాల్మొక్కుతా, నీబాన్చని' అనే ముండా కొడుకులుఎంత ధైర్యంగాపోట్లాడుతున్నారోయ్, స్వాతంత్ర్యంకోసం? నేను కల్లోకూడా అనుకోలేదు సుమా! నయమే, నిజాములో కమ్యూనిస్టులుకూడా మంచిపనేచేస్తున్నారు. వాళ్లని మెచ్చుకోక తప్పదు," అన్నాడు రంగారావు నాదగ్గర.

ఇంతలో మళ్లీ గాలి మళ్లింది. ప్రజాప్రభుత్వాలు "కమ్యూనిస్టు పీడ" అణచటానికి ఉపక్రమించాయి. కమ్యూనిస్టు పత్రికల మీద కేసులుపెట్టి పనిజరగక ప్రభుత్వం వీటిని అణచసాగింది. సరిహద్దుమీద నిజాము ప్రభువు వారి దౌష్ట్యాన్ని ప్రతిఘటిస్తున్న చోట్ల కమ్యూనిస్టులు నిర్బంధంలోకి పంపబడ్డారు. తెలంగాణా వీర పోరాటాన్ని చిత్రించే "మాభూమి" నాటకంమీద ఆంక్ష విధించబడింది. నిజాము ప్రభువు వారిని దారికి తెచ్చేటందుకు ఇవే మార్గాలని ప్రజా ప్రభుత్వం నిర్ణయిస్తే కాదనటానికి నేనెవణ్ణి?

కాని నేను రంగారావుతో మాత్రం "ఏమోయ్, మన ఆంధ్ర

రాష్ట్రం ఇంకా వెనక్కి పోతున్నట్టు కనిపిస్తుంది?" అన్నాను.

రంగారావు నామీద విరుచుకుపడ్డాడు. నాకీ ప్రభుత్వం పోవాలని ఉందన్నాడు. నేను నానాటికీ మరీ చెడిపోతున్నానన్నాడు. నాతో మాట్లాడుతుంటే చూస్తే నే తనను ద్రోహికింద పోలీసులు ఎరెస్టు చెయ్యవచ్చునన్నాడు. నాతో ఏది మాట్లాడినా ఫరవా లేదుగాని రాజకీయాలు మాట్లాడటం కంటె బుద్ధి తక్కువ లేదన్నాడు.

"ధరలకి కంట్రోళ్ళుండాలంటే కమ్యూనిస్టు నన్నావు. ఉపాధ్యాయులకు జీతాలు పెంచాలన్నా కమ్యూనిస్టు నన్నావు అయ్యో, పాపం, గాంధీజీని హత్యచేశారంటే కమ్యూనిస్టు నన్నావు. ఆంధ్ర రాష్ట్రంకావాలన్నా కమ్యూనిస్టునే అంటావా?" అన్నాను.

రంగారావు నామీద తనకున్న కసియావత్తు తీర్చుకున్నాడు. కసి దేనికో నాకర్థంకా లేదు. అది నన్ను బాధించనూ లేదు. అతను మాట్లాడుతున్నంతసేపూ నాకు వినపడ్డ మాటలు:

"నీ కాళ్ళొక్కుతా! నీ బాన్చని!"

*   *   *

 

# వీరనారి!

## డాక్టరు రాజారావు



### నాటిక

[పల్లెటూరు : గడీ (దివాణం) చీకటిగది ప్రస్తుతం తెలంగాణా వీరుల బంధించడానికి ఉపయోగించబడుతూంది. ఎడమవైపు ద్వారం : బయట తాళం వేసివుంది. తలుపునానుకుని మంచం, కుడివైపు ముందుగా మేజాబల్ల, కిరసనాయిలు లాంతరు, తెర యెత్తగానే ఒక యువతి (వయస్సు 18) మంచంమీద పడుకుని వుంటుంది - లేచి యిటూ అటూ పచారు చేస్తుంది – తప్పించుకు పోడానికి ప్రయత్నం – ఆవేదన - తలుపు గట్టిగా గుద్దుతుంది - భయం, కోపం, దుఃఖం వీటిని ప్రదర్శిస్తుంది - అంతలోకే అడుగులశబ్దం – తలుపుతీసేశబ్దం - ఒకమూల నక్కుతుంది – ఇద్దరు సిపాయీలు ప్రవేశం - వెనుకనే ముగ్గురు యోధులు ప్రవేశం - వాళ్ళచేతులు బంధంచబడివుంటాయి – సిపాయీలు యీబందీలను కుడివైపు గదిలోకి పోనిచ్చి కుడివైపు తలుపులువేసి గొళ్ళెంపెడ్తారు. 1వ సిపాయి యువతిని సమీపించి]

1 వ సి : ఏంపిల్లా! నిద్దరబోడం లేదేం? పక్క బాగోలేదూ? పాపం ఒంటరిగా వున్నావు గాబోలు-

[యువతి కోపంగా చూస్తుంది]

2 వ సి : ఊరుకోరా పిల్లకి కోపంవచ్చింది- తెలవదు నీకు.

1 వ సి : పిల్లకి అమీన్ సాబ్ నచ్చాడు.. నువ్వూ, నే...

యు : నోర్ ముయ్!

2 వ సి : అరె బాప్రే - మనకెందుకురా యీ గొడవ - అడికి తెలిస్తే మనపని హజామత్ చేస్తాడు – అనుమానం మనిషి.

[ఎడమవైపు తలుపు తెరుచుకుంటుంది—ముగ్గురు యోధులు ప్రవేశం—చేతులకు సంకెళ్ళు వేసి వుంటాయ్ - వెనకనే ఇద్దరు సిపాయిలు ప్రవేశం]

ఇద్దరు సిపా : "ఇక్కడే వుండండి - కదలొద్దు మెదలొద్దు తెలిసిందా !"

[సిపాయీలు వెళ్ళుతుంటారు. ముగ్గురు యోధులూ ఒకప్రక్కన నిలబడి వుంటారు]

1 వ సి : అరేయ్ - మన అమీన్ సాబ్ హాచ్చేరైంఅయింది-పోదాం పదబే.

[యిద్దరు సిపాయీలు యువతిని చూస్తూ గుటకలేస్తూ అవతలకి నడుస్తారు— ఒకడితల సైడ్‌కి తకీమని తగులుంది- అందరివంక చూసి పడిపోయినటోపీ తీసుకొని సర్దుకుంటాడు- బైటతలుపు వేస్తాడు అవతల నుంచి]

[వెంటనే యువతి 1 వ యోధుని వద్దకు గభాలున వచ్చి]

యు : అన్నా (యేడుస్తుంది)

1 వ యో : (తల నిమురుతాడు) చెల్లీ;

యు : అమ్మ, నాయినా, చెల్లీ వాళ్లంతా బాగున్నారా ! అన్నా

1 వ యో : (మాట్లాడడు - దుఃఖం పొర్లుకొస్తుంది)

2 వ యో : ఇంకెక్కడి అమ్మ, బాబూ తల్లి- పిచ్చిదాన ! అమాయకురాలివి—

3 వ యో : మన గ్రామంఅంతా యీగూండాలు తగలబెట్టేశారు- మన ఆడవాళ్ళని... అబ్బ ! చెప్పడానికి నోరు రావడంలేదు పసికందుల్ని అయ్యో...

2 వ యో : గ్రామం అంతా పీనుగుల్తో నిండిపోయింది...అప్పుడే కంపుకొడుతున్నాయి ఈనైజాం రాక్షసుల్ని...

1 వ యో : ఉష్ ! నెమ్మది... చెల్లీ, నిన్న యీ పాటికి చంపేస్తుంటారనుకున్నా అమ్మనీగురించి బెంగపెట్టుకుని .....

[కౌగలించుకుంటారు]

చూడమ్మా ! యేడవవద్దు.. మనంఒకళ్ళమే నా... అనేకులు బలిఅవుతున్నారు. నీ స్నేహితురాలు సీత యిద్దరు సిపాయోళ్ళను కత్తిపీటతో నరికి తనశీలాన్ని కాపాడుకుంది- మమ్మల్ని రక్షించింది- మనం ధైర్యం వహించాలి.

2 వ యో : ఆ యేంటో ! మన పిల్లా జెల్లల్తో గ్రామాలకు గ్రామాలు తగలబడిపోతుంటే, ఉత్తరాదోళ్లు మనకేం సాయం చెయ్యడంలేదు.

1 వ యో : ఎందుకు చెయ్యడంలేదు. మనకెంత ధనసహాయం చేసారు... కష్టజీవులంతా మన అండని నిలబడ్డారు. "వీర తెలంగాణా" జైఅని భారతదేశం యావత్తూ మారుమోగుతోంది.—

2 వ యో : పైగా మనం దోపిళ్లుచేస్తున్నామని, బందిపోట్లమని వాగుతున్నారట కొందరు పెద్దలు.

3 వ యో : ఎందుకు వాగరు! ప్రజాద్రో హులు ఎక్కడలేరు- దుష్ప్రచారమే వాళ్ళకు ఆయుధం. మనం గెలుస్తే వాళ్ళ ఆటలుసాగవని బాగా తెలుసు. మన యూనియన్ ప్రభుత్వాం ద్రోహి నైజాంతో యింకా మంతనాలు జరుపు తుంటే—

1 వ యో : వీళ్ళు కలిసినా, వాడుకలిసినా మనపోరాటం పట్టికి సాగిపోవాల్సిందే. మనం ఆక్రమించుకున్న గ్రామాలు మనవే.- మనం పంచుకున్న భూముల్ని మనం చచ్చినా వదలం.

[కుడి వైపునుంచి ఒక ఆర్త నాదం వినిపిస్తుంది.]

యెవరో యేడుస్తున్నట్టున్నారు.

యువతి : ఈ పక్క-గదిలో ముగ్గురు గెరి ల్లాల్ని బంధించారు. వాళ్ళయి వుంటారు.

1 వ యో :(కుడి కర్టన్ వద్దకువెళ్ళి- చెవ్వు పెట్టినొక్కి-మాట్లాడతాడు ) కా. మేడ్ కా. మెడ్, యేమిటది.

[వీళ్ళ దగ్గరకొచ్చి]

మంచినీళ్ళకి తపించిపోతున్నారు— ఇప్పుడు మనం యేం చెయ్యాలి...

[యువతి మూలనున్న కూజా నీళ్ళతో తువ్వాలు తడిపి గోడ మీదుగా విసురుతుంది]

అమీన్‌గాడు వచ్చే వేళయింది. మనల్ని రహస్యాలు బయటపెట్టమని నిర్బంధించవచ్చు. కాని మనం మోస పోకూడదు ఏం చేసినా సరే పెదవి కదపకూడదు- ఇక నీ సం 3 ఏమైనా చెప్పావా నీగురించి వాడికి....

యువతి : ఆ అమీన్‌గాడు ఒక ముసలి నక్క - వాడప్పుడే కొంచెం గ్రహిం చాడనుకుంటా. ఇంతవరకు నన్నేం బలవంతం పెట్టలేదు చెప్పమని-నన్నిట్లా వుంచితే కొద్ది రోజుల్లోనైనా అంతా వాళ్ళకి చెబుతానని పిచ్చినమ్మకం. ఒకటిన్నర రోజులైంది నన్ను ఇక్కడ బంధించి — అప్పుడే ఒక సంవత్సరం గడిచినట్లుంది - ఏంచెయ్యలేక పోవడం వల్ల నాకు పిచ్చెత్తికట్లుంది.

1 వ యో : మాతో సంబంధం లేనట్లు నటించు- బహుశా తెల్లవారేసరికి మే మంతా అంఖరవుతాం - నువ్ మాత్రం జాగ్రత్త - ఎట్లాగైనా తప్పించుకొనే మార్గం ఆలోచించు..అదుగో అడుగుల చప్పుడు

[యువతి మంచంమీద ఎరగ నట్టు పడుకుంటుంది — ప్రవేశం అమీన్.. వికృతాకారం వెనకనే యిద్దరు సిపాయీలు_యువతి లేచి పక్కగా నిల్చుంటుంది]

అమీన్ : ఏయ్ సిపాయ్! కడ ముగ్గు రెక్కడ?

వసి : ఈపక్క-చీకటిగదిలో బంధించాం సర్కార్.

అమీన్ :సరే వాళ్ళపని తర్వాతచూద్దాం- ఆ ది తాళంచేతు లెక్కడ?

వసి : నాదగ్గరున్నయే సర్కార్.

అమీన్ : ఇదర్ లావ్ (తీసుకొని బల్ల మీద పడేస్తాడు- యువతి చూస్తుంది) యే బద్మాష్‌కు ఖడా కరో!

(ముగ్గురు యోధుల్ని వరుసలో నిలబెడతాడు సిపాయి)

అమీన్ : చావాలని వుందో బ్రతకాలని వుందో అడగండి. ఏదైనా తేలికే. బ్రతకాలంటే నాకన్ని సంగతులు చెబితే పోతుంది.

వసి : ఏయ్ విన్నారా మాట్లాడండి.

అమీన్ : (యువతితో) ఎవరో అమ్మాయి నాతో చెప్పింది-నీకూ వీళ్ళకి సంబంధ మున్నదట నీవు చెప్పు His exalted highness the Nizam of Hyderabad చేసిన ద్రోహానికి వీళ్ళని కాల్చి వెయ్యాలో లేదో...... నే చెప్పింది నీ కర్థమవడం లేదూ? పోనీలే! అవి తర్వాత మాట్లాడుకుందాం. కాని చూడు! నీవేమీ తిండి తినలేదట గదూ! యీ రోజంతా (సిపాయీలతో) ఏయ్ మొద్దుముఖాలు. యీ అమ్మాయికి కష్టం కలగకుండా చూడమని చెప్పలేదూ- అరే జావ్ కుచ్ ఖానేకే లియాలావ్ (సిపాయీలనిష్క్రమణ) (యువతితో) ఇదిగో! ఆగూండాల్ని క్షమించు. నన్ను కూడా- నా పొరపాట్లని క్షమించు. వెధవ పని తొందర్లో పడి చస్తున్నాను. ఫుర్‌సత్ కుచ్ భీ-హీ-

[నిట్టూర్పుతో కుర్చీ స్వీకరిస్తాడు.]

మీరంతా నేనొక "బహీసు" నను కుంటున్నారు. మేరేకు సబ్ కుచ్ మాలుం హై— చెప్పండి, దేశముఖ్ సాబ్ జహ్వారీ అంతా ఎక్కడ దాచి పెట్టాగో మర్యాదగా చెప్పండి మీ లీడర్ ఆ రెడ్డి ఎక్కడున్నాడో చెప్పండి —

[ నిశ్శబ్దం ]

(మండుతూ) అరే గధే, క్యోం ఖామూష్ రహాతే, క్యోం జీ!

1 వ యో : మాటలు జాగ్రత్తగా రానీ.

అమీన్ : అరె సువ్వర్ కే బచ్చే (లేచి ఛడాలున లెంపకాయ కొడ్తాడు)

[ 3 వ యోధుడు బంధించిన చేతులతో అమీన్ నెత్తిమీద మోదుతాడు- ఇద్దరు యోధులు లంఘించుకుంటారు. అమీన్ బాకు తీస్తాడు, పడిపోతుంది.]

అమీన్ : (క్రింద బడ్తాడు) అరే అల్లా, సిపాయియో! అవురే బాబా అవ్. మై మరారే— మరా.

[ సిపాయీలు ప్రవేశం— ముగ్గిర్ని తిరిగి బంధిస్తారు ]

[ అమీన్ లేస్తాడు ఉగ్రుడై ]

అమీన్ : యేకుత్తోంకు బహార్ లేజావ్ ఫైర్ కరో - జావ్ జల్దీ

[ సిపాయీలు బందీలను బలవంతంగా లాక్కుని పోతారు - అమీన్ కుర్చీమీద కూలబడ్డాడు. కర్టన్ వరకు యువతి అనుసరిస్తుంది. అక్కడ పడివున్న బాకును మొలలో దాచుకుంటుంది-

మూడు గుండుదెబ్బలు వినబడతవి- యువతి మంచతమీదకు ఒరుగుతుంది-ఆర్తనాదం వినిపిస్తుంది- అమీన్ ఆనందంతో వెకిలిగానవ్వుతాడు- యువతివంక చూస్తాడు]

అమీన్. అరే సిపాయ్

1 సి: జీ హుజూర్

అమీన్: పానీ లేకయావ్

1 సి: జీ సర్కార్

[అమీన్ తన తోలు సరంజామాను విసుగుతో బల్లమీద పెడ్తాడు.]

[సిపాయి నీళ్ళు తీసుకొస్తాడు.]

[అమీన్ యువతి మొఖం మీద నీళ్ళు జల్లుతాడు - వులిక్కిపడి లేస్తుంది. మిగతానీళ్ళని తాను తాగేస్తాడు.]

అమీన్: ఏమంత గాభరాపడ్తావు పిల్లా, గుండుదెబ్బవినిజడిసిపోయావా! తోడా ఆరాం కరో- తోడా ఆరాంకరో!

[దగ్గరగా వస్తూంటాడు — దూరంగా తొలుగుతూవుంటుంది-

అవ్ – నజ్దీక్ అవ్ – అహా!! ఊ– నా బంగరు బొమ్మా— నీ కళ్లెంత ముద్దుగా వున్నయ్ — తెనుగుపిల్లల కళ్ళు ఫూల్ కె మాఫక్ రహతా...

[యువతి ఒయ్యారంగా నవ్వుతూసిపాయివైపు చూస్తుంది.-

అమీన్: (సిపాయివైపు తిరిగి) అరే క్యా దేక్తే బే! జావ్-తుమారే కాం దేక్లేవ్.

[సిపాయి భయంతో వెళ్తాడు.]

పిచ్చిపిల్లా భయపడకు— ఇక్కడెవ్వరున్నారు— నువ్వు నేను—నిన్ను నేను నిఖా కట్టేసుకుంటా— హమారా జనానేమే దఖల్ కర్దేవుంగా— అవ్ మేరే ప్యారీ అవ్— అవ్ మేరే బుల్ బుల్— ఆ! తైరో తల్వా హేసివస్తా

(ఎడమసైడ్ వద్దకుమరులాడు- వెనకమూరుగావచ్చి బాకుతో పొడుస్తుంది. అల్లా అని కూల్తాడు. చెంగున యువతి బల్లమీద తాళం చెయ్యి అందుకుని కుడివైపు గది తాళం తీయబోతుంది- అమీన్ దేక్కుంటూ అరుస్తూ బల్లదగ్గర కెళ్ళి పిస్తోలు తీసుకుంటాడు— కుర్చీలో కూలబడి యువతిపై గురిచేసి పేలుస్తాడు - యువతికి దెబ్బ తగులుంది- బలవంతంగా తలుపు తెరుస్తుంది)

యువతి: కామ్రేడ్స్ పరిగెత్తండి— ఊ త్వరగా- త్వరగా-

(యోధులు ఎడమ వైపుగా పరుగెడ్తారు-)

యువతి: వీర తెలంగాణా- జిందాబాద్ జిందా...బా (కూలిపోతుంది)

(సిపాయీలు పరుగెత్తుకొస్తారు)

( తెర )

శ్రీ 'గంగినేని'

# వస్తున్నాం!

**1**

వీరులార!
తెలంగాణ
శూరులార!
కలాలువిసిరి
కత్తులుదూసి
కదనానికి
మేముకూడ
వస్తున్నాం!
తెస్తున్నాం
జగద్విప్లవం!
తుపాకి గుండుకు
చితకని మీరొమ్ములు
మాగుండెకు జీవం
పోసెను!
మీదుక్కిపొలం
కక్కిన నెత్తురు
మాబళ్లంతా
రక్తశిఖలు
రగిలించెను!
మాకళ్లల్లో
అగ్నిశిఖలు
వెలిగించెను!
బాయినెట్ల పోటుకు
సడలని మీవ్రేళ్లని
పిడికిలి మాకండకు
బలంపోసె!
మీకోసం
కలంపట్టాం!
మీకోసం
కుంచెపెత్తాం!
మీరేమీరే
మాగ్రంథాలు!
మీబ్రతుకులు
మాకళాఖండాలు!
ఖండకావ్యాలు!

**2**

తెలంగాణ
భ్రాతృలార!
అరిగిన
మీపాదాలకు
మావీపులు
రాస్తాగా వేస్తాం!
విరిగిన

మా బ్రతుకులు
కలిపికుట్టి
కదనానికి
నడిపిస్తాం !
నల్లలురాలిన
చెల్లెలారా!
పుస్తెలుపోయిన
తల్లులారా !
మామండే గుండెలు
చించిఎర్రటి
నెత్తురుపట్టాం !
పెట్టుకోండి బొట్టు !
పట్టుకోండి కోట !

3

ద్వేషాగ్నులు
చెరుగుతోన్న
వ్యథాకలిత
వృథాజీవులార !
రోషాగ్నులు
ఉముసుతోన్న
యువకులార !
అవమానం
కాటందని
అదువైనా
లేదుమాలో !
పరాభవం
ఎంగిలిచేయని
సహోదరి —
లేదీప్రాంతం !
ప్రతీకార
అగ్నిద్రవం
ప్రవహించే
మనరక్తం —
నిరంకుశ నిజాం
ప్రభుత్వంపై
తిరుగుబాటు
ప్రకటించెను !
సమరగీతి
సామ్రాట్టుల
మరణగీతి
నినదించెను !

రాచపుండు
పట్టుకొని
రాజరికం
విలవిల
తన్నుకుంటోంది.!
దేశముఖులు
జాగీర్దార్లు
పటేళ్ళు పట్వారీలు
పరారైరి !
పారిపోయే

పగవాండ్లను
పట్టుకోండి!

**4**

తెలంగాణ
ప్రజలార!
విలయకాల
ప్రళయరుద్రులార!
యూగ పశువు
నాజీ నైజాంను
బందీచేశారా!
రాక్షస రజాకార్ల
గోరీల్ త్రవ్వారా!
ఉరకండి!
శత్రుమూకల
నరకండి!
కళాకార్లు
చేరిన మీ సైన్యం
జయిస్తుంది!
సాహిత్యమహాస్త్రం
సారించిన మీ బలం
జయిస్తుంది!
విశాలాంధ్ర
నేతలార!
తెలుగుదేశ
భానులార!
మీకోసం
మిన్నులు దిగి
వచ్చాము!
మీతోటే
వస్తున్నాం
సమరభూమి!
తెస్తున్నాం
విశ్వవిప్లవం!





కథ

# విముక్తి

శ్రీ ఎ. పిచ్చేశ్వరరావు

ఊళ్లోవాళ్ళకందరికీ తెలుసు. సుబ్బమ్మ యీమధ్య బయటికి రావటం మానేసింది. తన చుట్టుగుడిసేమో తనేమో. అంతే — ఆ చుట్టుగుడిసెలో డొక్కునార మంచమూ, ఆ డొక్కునార మంచంమీద సుబ్బమ్మా. వాకిట్లో కోడిపుంజూ.

ఇంతకు పూర్వం వూళ్ళోవాళ్ళందరికీ తల్లో నాలుకలా తిరిగేది సుబ్బమ్మ. కొత్తిల్లు కట్టుకున్నా, యింట్లో కొత్త కోడలు అడుగుపెట్టినా — రూపాయంత 'కుంకంబొట్టు'తో 'లచ్చిందేవి'లా వచ్చేది. ఎవళ్లకి ఆపదొచ్చినా వెళ్ళి ఆశ్వాసన యిచ్చేది. ఊళ్లోవాళ్లందరూ ఒక 'పెద్ద దిక్కు'గా చూచేవారు సుబ్బమ్మంటే.

అట్లాంటి సుబ్బమ్మ యీమధ్య బయటికి రావటం మానేసింది. తన చుట్టుగుడిసేమో తనేమో. అంతే — ఆ చుట్టుగుడిసెలో డొక్కునార మంచమూ, ఆ డొక్కునార మంచంమీద సుబ్బమ్మా. వాకిట్లో కోడిపుంజూ.

ఆ డొక్కునార మక్కులో పండుకుని సుబ్బమ్మ కళ్లు మూసుకునేది. నిద్ర వస్తూందనీ కాదు 'నిద్రొదలి పెట్టి నెల పైయింది'. కళ్ళు మూసుకోగానే గెరటయ్య కనపడేవాడు. ఆ మనిషితో ముప్పైయేళ్ల పైగా 'కాపరం' చేసింది. కన్ను పొడచుకుంటే కనపడని చీకట్లో నైనా సరే పాదాల చప్పుడువిని పోల్చిపట్టగలిగేది గెరటయ్యేనని. ఆ కోరమీసాలూ, ఆ పొన్నుకర్రా... సుబ్బారెడ్డి మనుషులొచ్చి కర్రిపెయ్య పలుపు విప్పినప్పుడు పంచి చెంగులు బొడ్లలో దోపుకుని, పొన్నుకర్ర భుజాన పెట్టుకుని అడ్డంవెళ్ళే గెరటయ్యని తలుచుకుంటే......తన గుండె గడగడలాడేది. వంటింట్లోదల్లా పరుగెత్తికెళ్లి గెరటయ్య గడ్డంపట్టుకుని బ్రతిమలాడకపోతే యేం చేసేవాడో! "యిదుగో. నామొకం చూచైనా వూరుకోవూ. మనగీత యిట్టా వుంటే యెవర్నని యేంలాబం? బగమంతుడే వుండాడు!" అని తనంటే ఆ కోరమీసాలు యిట్లా కదుల్లాడాయి "ఆ యెదవ సాడదాంకోసుకు కొండ్రు కొట్టుకు పోయినప్పుడూ అట్టాగే అంటివి.

... కత్రిసెయ్యని తోలుకుపోతుండా ఈ మాటే అంటూంటివి" అని గుండె తోడు కున్నట్లు మాట్లాడాడు. తన కళ్లెంట నీళ్లు గిర్రున తిరిగినయి. తనకి మాత్రం లేదూ కత్రిసెయ్యంటే మమత? తన కళ్ళల్లో నీళ్లు తిరిగితే యెద్దులాంటి గొరటయ్య కుక్కిన పేనయిపొయ్యేవాడు. తరవాత నట్టింట్లో కూర్చుని యంత కుళ్ళిపోయాడు ఆ మనిషి, మూడు రోజుల్దాకా మెతుకన్నా ముట్టకుండా.

ఈ మాటలన్నీ గుర్తుకొచ్చేప్పటికి సుబ్బమ్మకళ్లు చెమ్మగిల్లేవి. ఇప్పుడంటే గొడ్లసాకా లేదు. నట్టిల్లూ లేదు. గొరటయ్యా లేడు. కళ్లల్లోకి కారుచీకట్లు కమ్ముకొస్తూన్నట్లనిపించేది. వళ్లంతా వణికి పొయ్యేది. కళ్లు మూసుకుంటే కనబడతాడని కళ్లు పట్టుబలవంతానా తెరుచుకునేది. తెరుచుకుంటే వున్న చుట్టుగుడిసె. ఒక మూల పుట్టి. పుట్టిలో ముద్దంత ముంత. ఆ ముంత అత్త యిచ్చింది సుబ్బమ్మకి. "సుబ్బమ్మా దీన్ని కళ్లల్లో పెట్టుకుని పూజించుకో. అచ్చొచ్చిన ముంత" అని చెప్పింది అత్త.

తాను కాపరానికి కొత్తగా వచ్చిన రోజుల్లో కళా పెళా కాగిన 'నెయ్యి' ఆ ముంతలో పోసి, గొరటయ్య పళ్లెంలో గుమ్మరించేది. సుబ్బారెడ్డి ఆ 'కాండ్ర' కాస్తా పొట్టబెట్టుకున్నతర్వాత ఆ ముంతెడు మెంతి 'చల్లా' గొరటయ్య పళ్లెంలో గుమ్మరించేది. ఇప్పుడు చూసుకుంటే ఆ ముంతెడు 'గింజలు' గూడా లేవు వండుకుతింటానికి.

అందుకనేనేమో, గొరటయ్య గుండె అంత రాయై పోయింది. "అవ్, పిచ్చి దద్దమ్మా, యేం బతుకుతుడే— బతకనం తుడ్లో. బతుకుతుడ్లో అంటావూ. పుట్టిన కాణ్ణించీ వంచిన తల యెత్తలేదుగందా— పగలనకా, రాత్రనకా, కష్టపడితే, సివరాకి సిట్టిముంతెడు గింజలుగూడా దొరకవాయె సమయానికి." గుండె యెంత రాయి కాక పోతే అంటాడు ఆమాట. అంతే— పైపంచె భుజాన వేసుకుని చుట్ట కాల్చుకుంటూ బజారులోకెళ్ళాడు. మళ్ళీ గడపతొక్కలేదు.

ఇంకా సుబ్బమ్మ కళ్ళకి కట్టినట్లు కనపడుతూంటుంది చివరగా సాగిపోయ్యే గొరటయ్య వీపు. అదే చిట్టచివరి చూపు.

గొరటయ్యతోపాటు కదిలి పోయింది సుబ్బమ్మ ప్రపంచం. తన చుట్టుగుడిసేమో డొక్కనారకుక్కేమో, తనేమో...

"సుబ్బమ్మమ్మా! సుబ్బమ్మమ్మా" అని 'మల్లి' కేకేస్తే మొట్టమొదట 'ఆఁ' అనిగూడ అనలేకపోయింది సుబ్బమ్మ. కళ్ళు తెరచి చూస్తే, తలుపులేని గుమ్మంలో నీడలా నిలబడి కన్పించాడు 'మల్లి.'

"సుబ్బమ్మమ్మా!" అన్నాడు 'మల్లి' మళ్ళీ.

"యెవురు బాబూ!" అంది సుబ్బమ్మ.

"నేనేనమ్మా, మల్లిని. జనాళ్ళంతా చెరువుగట్టుమీద పోగయ్యారు. నిన్నెంటబెట్టుకు రమ్మన్నారు నన్ను" అన్నాడు మల్లి.

"నేనా? చెరువుగట్టుకా...!" అని గొణుక్కుంది సుబ్బమ్మ. తను చెరువుగట్టుకేం ముఖం పెట్టుకొని తొక్కుతుంది?

చివరికి చెంబెడు మంచినీళ్ళు తెచ్చుకోడం గూడా మానేసిందే తను? చెరువుగట్టు పేరుచెబితేచాలు సుబ్బమ్మ గుండె దేవురు క్కెట్లవుతుంది. చెరువుగట్టుమీదరావిచెట్టు. రావిచెట్టుకింప సుట్టెదిమ్మ. సుట్టెదిమ్మమీద 'సరస్సోతి.' సరతిచుస్నాట్టా 'రజకార్లు.' రజకార్ల వెనక సుబ్బారెడ్డి. ఊళ్లో 'ముగపురుగులు' లేపుడు యేంచేశారు! యేంచేశారు ఆ పాపాలభైరవులు...... యేం నవ్వు నవ్వాడు ఆ సుబ్బారెడ్డి ఆ 'పీనుగు' మొఖంతో. ఎట్లా లాక్కు పొయ్యాడు సరస్సోతి చెంగుపట్టుకొని... బరబరా...తను మాత్రం యేం చెయ్య గలిగింది? "వుండండి! కుక్కల కొడుకు ల్లారా!" అంటూ పిచ్చెత్తినట్టు పరుగెత్తింది సరస్సోతి దగ్గరికి. తరవాత యేం జరిగిందో? లేచి చూచేప్పటికి నడుమంతా పిండికొట్టినట్లయింది...

"రా! సుబ్బమ్మమ్మా" అంటున్నాడు 'బుల్లి'. మంచం కోళ్లమీద చేతులాన్చి దేకి లేచి కూర్చుంది సుబ్బమ్మ. వూళ్లోవాళ్ళందరూ పోగయ్యారంట...!

లేచి వాకిట్లోకి నడిచింది సుబ్బమ్మ. నడి 'యేసంకాలం'. మిట్ట మధ్యాహ్నం. ఆవిర్లు కక్కుతోంది నేల. సుబ్బమ్మ కళ్లు చిరతలాడాయి.

బయట అడుగు పెట్టేప్పటికి భగ్గున మండినయి కాళ్లు. 'మాడు' మండిపోయినట్లయింది. భుజంమీద కొంగు తలమీదగా తిప్పి నోట్లో పెట్టుకుంది సుబ్బమ్మ. అట్లాగే దిక్కులు చూస్తూ మండే కాళ్లని గూడా మరిచిపోయింది. యెక్కడ చూసినా మొండి గోడలు. బొగ్గులైన గుమ్మాలు. మసి బొగ్గులు పూసుకున్న మొండి గోడల్ని చూస్తే...

మనుషు లుంటున్న వూరికిమల్లే లేనే లేదు. వల్లకాడులోలా బూడిద పోగులు. కాకిగూడా కదలటం లేదు. పిచ్చికలు గూడా పలకటం లేదు. సుబ్బమ్మకి 'భీతావహం' వేసింది.

"పదరా బాబూ" అంది సుబ్బమ్మ.

కళ్లెత్తి చూడాలంటే కంపరం పుట్టింది. అట్లాగే తలవంచుకుని బజార్లో 'కత్తిగెడ్డలు' తొక్కుకుంటూ బయల్దేరారు. ముందు బుల్లి, వెనక సుబ్బమ్మా.

పుట్టినకాణ్నుంచీ నడిచింది సుబ్బమ్మ ఆ బజార్లలో. వర్షాకాలం మోకాటి బురదలో ఆ చేతినా యీ చేతినా నీళ్ళ బిందెలు పట్టుకుని గూళ్లు జారేట్టు మోసేది. అప్పుడే పడుతున్న తడితడి దార్లలో పూలపాన్పులమీద నడిచినట్లు నడిచేది. "యేంవేం కోడలా!...బుల్లీ!...బాగుండావా...బుడ్డాడిజరం యెనకట్టిందా... మీ ఆయనింకా రాలా ... మనవాణ్ణెప్పుడెత్తుకో మంటావే..." అంటూ 'యేదాలాపం'గా కత్తిగెడ్డల్ని కూడా మరిచిపోయి నడిచింది ఆ బజార్లలో. ఆమనునే బిడ్డలెంతో ఆ 'బెడ్డ' లంత సుబ్బమ్మకి.

ఎన్ని 'యేసంకాలాలు' వచ్చినయి ఎన్ని పోయినయి. బజార్లలో ఒక్క ముగ్గన్నా లేకుండా, పసుపూపిన గడపలు చూడకుండా, గోళీలాడుకునే పిల్లల్ని చూడకుండా, "సుబ్బమత్తా!" అని పిలిచే ఆడపడుచుల్తో మాట్లాడకుండా యెప్పుడు

నడిచింది సుబ్బమ్మ ఆ బజారులో. వూరంతా 'బేలు' మంటోంది. సుబ్బమ్మకి అడుగుపడలా. పొట్ట చేత్తో పట్టుకుని బావురుమంది.

సుబ్బమ్మ బహిర్ప్రపంచంలో పడేప్పటికి 'మల్లి' చేయూతిచ్చి ముందుకు నడిపిస్తున్నాడు. సుబ్బారెడ్డి మేడ- తెల్ల దిబ్బలా కనబడింది సుబ్బమ్మకి. బూడిదల పోగుల వల్లకాడులో కొరివిదయ్యంలా చూస్తోంది సుబ్బారెడ్డి మేడ. మేడ రాజద్వారానికి పెద్దం తాళం వేసుంది. మేడ మీద యెఱ్ఱజండా యెగురుతోంది.

సుబ్బమ్మ వొక్కసారి వెనక్కి తిరిగి చూచింది. వల్లకాడులో పెళ్ళి పందిరేసినట్లుంది వూరంతా. మొండి గోడలమీదా బూడిద గుట్టలమీదా యెఱ్ఱ జెండాలు యెగురుతూన్నయి. బాల వితంతువు ముఖాన 'కుంకం బొట్టు'లా కళకళలాడుతోంది వూరంతా. గొరటయ్య కోర మీసాల్లోనుంచి నవ్వుతూ పిలుస్తూన్నట్లనిపించింది సుబ్బమ్మకి.

చెఱువు మొగ కొచ్చారు మల్లి, సుబ్బమ్మా కలిసి. చెరువు గట్టు కళకల మంటోంది. యెక్కడ చూచినా జనమే. వాళ్ళందరి ముఖాలూ సుబ్బమ్మకి తెలుసు. కొంతమంది బొడ్డులు సొంతంగా తనే కోసింది. కొంతమందికి వుగ్గు పోసింది. తన దోసిళ్లలో వాళ్ల దోసిళ్లు 'కూరి' 'తలంబ్రాలు' పోయించింది. వాళ్లే చెరువు గట్టునిండా కిటకిటలాడుతున్నారు. ఫేలి పోతున్నారు. "సంఘానికీ—జై !" అని చెవులు 'గళ్లు పడేట్టు' అరుస్తున్నారు.

చెఱువు గట్టుమీద రావిచెట్టు. రావి చెట్టుమీద యెఱ్ఱ జండా. రావిచెట్టుకింద మట్టి దిమ్మ. మట్టి దిమ్మమీద 'పెకాశరావూ, పురోహిత్తం, పెబాకరుడూ !'

'పెబాకరుణ్ణి' చూడగానే గొరటయ్య గుర్తుకొచ్చాడు సుబ్బమ్మకి. పదిమంది 'కసాయీ కుక్కలకొడుకులు' గొరటయ్య మీదపడి 'నుగ్గూనూచం' చేస్తూంటే యీ 'పెబాకరుడు' యింకా ముందూ సూడకుండా యెల్లి యిద్దరి తలకాయలు వొక్క దెబ్బని పగలగొట్టాడని చెప్పాడు 'పెకాశరావు.' "యెంత గుండెగల ఘటం!" అని నోరు తెరిచింది ఊరంతా. "పాపం! బిడ్డ! యెంత దెబ్బ తిన్నాడు నా మనిషికోసం" అనుకుంది సుబ్బమ్మ పెబాకరుడి పగిలిన తలకాయ చూచి

సుబ్బమ్మ అట్లాగే నిలువు కళ్ళతో చూస్తోంది, దిబ్బమీది వాళ్ళవంకా, దిబ్బ చుట్టూ పోగైన జనం వంకా. చూస్తూ చూస్తుండగానే సుబ్బారెడ్డి గూడా యెక్కాడు దిబ్బమీదికి.

"నుంచొంటా వేందిర సిగ్గులేక!"

"డొక్కలిరగతన్నండి నాయాల్ని!"

"చింతబరికల్తో చావబాదండి!" అంటూ జనం విరగబడింది. సుబ్బారెడ్డి నవకటం లేదు. బెదకటం లేదు.

"యెదవని వురితియ్యండి" అన్నాడు తలారి రామన్న. "అంతే! వురితియ్యాల్సిందే యెదవని" అని వూరంతా వూగిపోయింది.

సుబ్బమ్మ గొంతుక్కూర్చోబడింది. రెండు చేతుల్లోనూ కణత లదుముకుంటూ

"పాపిష్టి కుక్కల కొడుకని పోనీయండి బాబూ! ఆ పాపం మన కెందుకు?" అంది సుబ్బమ్మ. ఆ మాటలు మల్లికే వినిపించాయి.

"సుబ్బమ్మమ్మా! ఇట్టా కిందటిసారి వదిలిపెడ్తేగాదూ యీ యెదవ యెల్లిపోలీసోళ్లనీ, రజకర్లనీ తీస్కొచ్చి వూరంతా వల్లకాడు చేశాడు. తగులొడ్డ కొంపలు చాలవూ?" అన్నాడు మల్లి.

"ఈణ్ణి గూడా అట్టాగే తగలడనియ్!" అంది సుబ్బమ్మ. వూళ్ళోవాళ్ళు వొకొక్కళ్ళెక్కుతున్నారు. రావిచెట్టుకిందమట్టిదిమ్మమీదికి.యెక్కి వొకొక్కళ్ళు చెబుతున్నారు సుబ్బారెడ్డి చేసిన పనులు. సుబ్బమ్మ కవన్నీ తెలుసు. వాళ్ళు చెప్పేవన్నీ కళ్ళారా చూచింది సుబ్బమ్మ. పచ్చగా పెరిగే కాపరాల్లో సుబ్బారెడ్డి యెన్ని 'నుప్పులు' పోశాడో! "సిత్తరొద సెయ్యండి సచ్చినాణ్ణి" అంది సుబ్బమ్మ.

'నుప్పు' లాంటి 'సరస్సతి' కనబడింది సుబ్బమ్మ కళ్ళముందు. రెండు చేతుల్తోనూ కళ్ళు గట్టిగా మూసుకొంది సుబ్బమ్మ...

"సుబ్బమ్మమ్మా! సుబ్బమ్మమ్మా!" అంటున్నాడు మల్లి. ఏమిటన్నట్టు మల్లి వంక చూచింది సుబ్బమ్మ. మల్లి చేతుల్లో పలుపుతాడుంది. మల్లి వెనకాల 'కర్రావు' వుంది. ఆ 'కర్రావు' వెవరిదో సుబ్బమ్మకి తెలుసు. సుబ్బారెడ్డి దొడ్లో 'లచ్చిందేవి' ఆ కర్రావు. నాలుగు కోడిదూడలు పెట్టింది కర్రావు సుబ్బారెడ్డి దొడ్డిలో. ఆ నాలుగు కోడిదూడలూ పట్లు పట్టటం లోనూ, బళ్లలాగటంలోనూ వూళ్లో కల్లా మొనగాళ్లు. బండి లాక్కుంటూ యింటి ముందునుంచీ వెళ్లేప్పుడల్లా సుబ్బమ్మ చూస్తూనే వుండేది.

పుట్టి దొడ్లు యేసిన బండిని గండి బురదలోంచి లాగలేక వూళ్లో యెద్దులన్నీ కాడెగ ట్టే యీ కోడిదూడలెళ్ళి వొక్క వూపుతో వొడ్డుకు లాక్కొచ్చాయని వూరంతా చెప్పుకుంది. గేలాపేస్తే 'అగమే గాళ్లో' యెగిరిపోయే యనేవాళ్లు వూళ్లో వాళ్లందరూ. వుంటానికి సుబ్బారెడ్డి దొడ్లోనేవున్నా 'రామమ్మ గిత్తలు, రామమ్మ గిత్తలు' అనేవాళ్లు వూరంతా.

"యెవరి దొడ్లో వుంటే నేంది? నా లచ్చిందేవి సంసారం కాదూ" అని మురిసి పోయేది సుబ్బమ్మ.

ఆ కర్రావు వెనక ఆ నాలుగు కోడి దూడలూ కన్పించాయి సుబ్బమ్మకి.

"సుబ్బమ్మమ్మా! సుబ్బమ్మమ్మా! నీ గోలచ్చిదేవినీ, కోడిదూళ్లనీ, కొండ్రల్నీ నీ కిచ్చేశాను!" అంటున్నాడు మల్లి.

"యేంటీ?" అంది సుబ్బమ్మ కర్రా వెంక అదేపనిగా చూస్తూ.

"గాయ పెభుత్తం యెవళ్లవి వాళ్ల కిచ్చేత్తుంది!" అన్నాడు మల్లి.

ఆ యములోడు సుబ్బారెడ్డో?" అంది సుబ్బమ్మ. "ఆడికి సొంతం యేంవుండి సచ్చింది. అంతా మనోళ్లుకొట్టి పోగేసుకుందేగా!" అంటున్నాడు మల్లి.

(మిగతా 88 వ పేజీలో)

# యుగగేయం

## "రాజనందగాం" (మధ్యరాష్ట్రాలు) పోలీసుల కాల్పుల్లో వీరమరణం పొందిన కార్మికులు రామదయాళ్, అబ్దుల్ కాదిర్‌ల జ్ఞాపకార్థం



హృదిలో మెదలిన నిట్టూర్పుల అలయై
గనిలో కదలిన చీకటి తెరయై
హంతకుల మరతుపాకి
మా రుధిరం కార్చిన దిచటే!
మాదైనందిన విషాద కెరటం
ఉవ్వెత్తుగ ఆకసమంటిన దిచటే!!

ఎదలు పగుల దిక్కులు ఘోషించెను-
మనవెతలో, కన్నీరో, ఆశలో!!

ఓ పడిపోయిన అన్నలార!
నోరులేని మీ దుఃఖం
ప్రవహించెనె నిశ్శబ్దంగా?
చెరుపలేవు పదునాలుగు శకములైన
ఈ శిలపై చిందిన మీ రక్తపు మడుగులు!!

ఈ నిశీథ నిశ్శబ్దం చీల్చుక
పాడెద నిక విప్లవ గీతం
పాడెద నిక విశ్వశ్రామిక గేయం!
చాటెదనిక ఎలుగెత్తి
తాడితుల పీడకలకు తుదిదిన మిదియని!

యుగ యుగాల బలిదానం
ఫలియించును నేటి రేయి!
నిర్భాగ్యులు నిదుర లేచి
సుత్తి నెత్తి గర్జింతురు!
హాతమనస్కు- లక్షౌహిణులై
హాలాయుధ మెత్తిదరిక!
ప్రతిబింసువు బడబానలమై
ధరిత్రి దానవుల తుద ముట్టించును!

గతమంతా త్రవ్వి తీసి
ప్రభవింతురు పరాభవులు!
మున్నీరై మా తల్లుల కన్నీరే
మంగళహారతు లిచ్చును!
కడుపుతిండి లేని "మూక"
కార్చిచ్చులు కల్పించును!
వెలుగోక నిడక్రింది
జగమెల్లా కంపించును!!

నీరునిప్పు నిదుర లేచి
విశ్వమెల్ల ముంచెత్తును,
పలుమూలల ప్రవాసితులు
మ్రోగింతురు నగారాలు!

చరమసంధ్య దాపురించి
కూలద్రోయు కిరీటాల!

ఘర్మ జలప్రవాహాల జలపాతపు విద్యుచ్ఛక్తి
నిర్మూలించును నిరంకుశుల పీఠాల్!
రచియించును భవ్యచరిత రక్తాక్షరములతో
కండలు కరిగించిన వారల కథనం!
వియత్తలము లిఖియించును విప్లవ లేఖినితో
పడిపోయిన తమ్ముల త్యాగం!
మారక్త దీప్త అరుణ పతాకను
ఆకసమే ఆహ్వానించును!
దివానిశలు జోహార్లెత్తగ
ప్రకృతెల్ల ప్రణమిల్లును!!!



( 85 వ పేజీ తరువాయి )

కన్రావు సుబ్బమ్మకేసి దీనంగా చూస్తోంది. సుబ్బమ్మ వుక్కుచోటి వుండ లేక పోయింది. చేతులు చాచుకొని పరు గెత్తుకెళ్ళి కన్రావు మెడ కౌగిలించుకుంది. కోడిదూళ్ల వీపులు నిమిరింది. కన్రావుకళ్ల నీళ్లుతుడుస్తూ "నా బంగారం కాదూ! నా లచ్చిందేవి కదూ!" అనిఅంటూన్నపుడు సుబ్బమ్మ కంఠం గద్గదమైంది.

ఊరంతా వొక్కసారి—

"సంఘానికీ—జై!" అంటూ వుప్పొంగి పోతూంటే "సంఘానికీ—జై!" అంటూ తన స్వరం కలిపింది సుబ్బమ్మ.

శ్రీ పి. వి. శివయ్య

# తెలంగాణా రణనినాదం

తెలంగాణా రణనినాదము
దిక్కులను మార్మ్రోగ్మసిపిలచెను ॥

తెలుగుదేశ విముక్తి యుద్ధము
తెలుగుజాతికి ధర్మయుద్ధము
తెలుగునెత్తుగు మండుగుండెల
తెలుగువీరులు ముందుకురికిరి ॥

తెల్లదొరలకు తలుపుతెరచి
తల్లినేలకు దాస్యమిచ్చిన
మొదటిబానిస కులము నైజాం
పాలనమ్మకు నాశనమ్మని ॥

కొప్పులాగి చీరలొలిచీ
శీలమరరే! చెరచినాడుర
వాని తనువింతింతలుగ తెగ
నరుక, శపథము రణనినాదము ॥

తెలుగుదేశమ్మొక్కటేయని
తెలుగులంతా ఒక్కటేయని
కాకతీయ యుగాంధ్రులిచ్చిన
సంప్రదాయ జ్యోతినిల్పిన ॥

రాయలాంధ్రము నుత్తరాంధ్రము
రాక్షసుడ! కబళింప వత్తువ!
తూర్పుసంద్రపు టలలు నైజాం
పాదముల ముద్దాడవలెనా!! ॥

ఓరి! రజ్వీ! యెరుగవటరా!
తెలుగు సంద్రము శక్తిపొంగి,
కెరటమై యాకసమునంటి,
ప్రళయముగ నిదె వచ్చుచున్నది ॥

నిన్ను, నీ రజకార్లనూ మిము
మేపిపెంచిన దుష్టశక్తుల
పాదుషా సింహాసనమ్మును
మ్రింగివేయగ వచ్చుచున్నది ॥

తెల్లదొరలకు చిన్నతమ్ముడు
నల్లసర్దార్ నాటు 'హిట్లరు'-
నాజినైజాం ప్రణయ ఫలములు
తెలంగాణా విలయవహ్నిలో
భస్మమై ధూమమ్ముగ్రమ్మెను ॥

తెలంగాణా యుద్ధదీక్షలో
తెలంగాణా విక్రమములో
తెలంగాణా ఆత్మబలిలో
తెలంగాణా రక్తలేఖని
వ్రాయుచున్నది విజయఘట్టము ॥

ఉత్తరాంధ్రము, రాయలాంధ్రము
తెలంగాణా ఆంధ్రమొకటై
విశాలాంధ్ర ప్రజారాజ్యవి
నూత్నజగతిని సృష్టిచేయును ॥

నేటి కార్మిక కర్షకావళి
తోటి యాత్రికులైన పీడిత
కోటితో నైక్యముగ నచ్చట
రాజ్యచక్రము త్రిప్పుచుందురు ॥

యుద్ధమున మృత్యువుకు చిక్కక
దక్కి నిలిచిన ప్రజాశత్రుల,
ప్రజాద్రోహుల పాలిటికినా
డక్కడొక నరకమ్ము పూన్తురు ॥

అటక్షుధార్తు లనాథ దీనులు
అటను సంస్కృతి జ్ఞానహీనులు
అటను ప్రభు బానిసల భేదము
లేని నూతన జగతి వెలయును ॥

గౌతమీ కృష్ణాస్రవంతుల
కౌగిలింతల నమృతమ్ములు
కురిసి, సస్యపు పులకరైమన
తెలుగు పొలములు విరిసెనుర్వి ॥

నెలలు నిండిన తెలుగుతల్లికి
కడుపు పండిన ఖనిజ సంపద
యంత్రశాలల మలచి తీరిచి,
సంతరించును తెలుగుసంతతి ॥

తెల్లసర్పము తెచ్చియిచ్చిన
నల్లదొరల నియంతృకమ్మున
నరకమును ఎదిరించిపోరెడి
నిఖిల భారత జాతి జనులకు
మేలుకొలుపులు పాడుతున్నది,
నూత్న భారత ప్రజారాజ్యపు
దారియిదియని చూపుచున్నది ॥



# పగ!

శ్రీ పొట్లపల్లి
రామారావు

## నాటిక

ప్రదేశం : తెలంగాణా

కాలం : ప్రస్తుతం

పాత్రలు :

పుల్లయ్య, నరసయ్య - రైతులు, ఇద్దరు నైజాంపోలీసులు, నరసింహా రెడ్డి - పొలిటికల్ వర్కర్ అమీన్ ఎలవాడు.

### ఒకటో రంగం

[ ఊరిమధ్య నాలుగు బాటలదగ్గర రావిచెట్టు. రావిచెట్టు చుట్టూ రాతిగద్దె. గద్దెపక్కన పుల్లయ్య, నర్సయ్య నిలబడి మాట్లాడుకుంటుంటారు. ]

పుల్లయ్య : మొన్న సింగారం అమీనువస్తే సోలెడు బియ్యంకావాల్నంటే, యిచ్చినోడు లేడట. కోమట్లు మాదగ్గర లేవంటె, మాదగ్గర లేవని, జవాన్లు పిలచినా, చేయిపట్టి యీడ్చినా, ఎవడూ కదలలేదట.

నర్సయ్య : బియ్యం పోనీయి...మళ్లీ ఆ ఊళ్ళోనుంచి పోదామంటే బండి దొరకలేదు...ఎవడు యిస్తడు ?

పుల్లయ్య : ఎట్లాపోయిండు మరి ?

నర్సయ్య : 'కాళ్లు నెత్తిన పెట్టుకొని... ఏమిచేస్తడు ? ఊళ్లో నిలవబడితె పరువు దక్కేటట్టు లేదాయె. ఊరును యేమిచేస్తనో చూడు అని మంట మండుకుంటు పోయిండట.

పుల్లయ్య : మాట...మళ్లె...మరి ?

నర్సయ్య : అది వివరాదు!...సాకలోళ్లు అంతా యిండ్లల్లో లేమని తప్పించుకున్నరట. రూపాయి, రూపాయి,యిస్త మంటే, అద్దైనాఎంతో బ్రతిమిలాడితె, యిద్దరు కూలోళ్ళు వచ్చిండ్రట. వాళ్ళైనా రూపాయీలు చేతుల పెడితె, వస్తమన్నరట. దేవుడా! అనుకుంటూ పటేలు ఎక్కణ్ణో తెచ్చి యిచ్చిండట అప్పుడు.

పుల్లయ్య : కూలోళ్లు మాగ దొరికిండ్రు. వాళ్ళకు ఏమిపుట్టింది దుర్బుద్ధి ?

నర్సయ్య : మన పెద్దలు లేరు ? అమీనుకు యెక్కడ మనసు విరుగుతదో! యెక్కడ నొప్పి అయితదో! యేమి కోపమొస్తదో ? అని యెంతభయం ? యెంతబాధ వాళ్ళకు.

పుల్లయ్య : ఈ ఊరిపెద్దలందరిని నీళ్లులేని దగ్గర ...

నర్సయ్య : వీళ్ళ బలము చూచుకొనె నాయె, మనని వాళ్ళు పీక్కతినేది ? లేకుంటే మనమీద చేయివేయడానికి యెన్నిగుండె లుండాలె వీళ్ళకు ?

పుల్లయ్య: వాళ్ళకు ఇంత యెంగిలి కూరికి తెసరి...

నర్సయ్య: జాగీరులో యీ పెద్దలందరు కలిసె పట్టి యిచ్చింద్రట... నారాయణ పంతులును.

పుల్లయ్య: మనవాళ్ళే మనయింటి మర్మం చెపుతుంద్రు. యింటిదొంగ ప్రాణగండం...

నర్సయ్య: నరసింహారెడ్డి వెంబడి పడ్డరు వీళ్ళిప్పుడు. ఆయనను ఎట్లయినా పట్టి యివ్వాలెనని యెన్నో ఆలోచనలు, యెన్నో వేషాలు, యెన్నో పన్నాగాలు పన్నుతాంద్రు.

పుల్లయ్య: ఆయనగాని వీళ్ళకు దొరకడు. ఎవనికడుపుల యేమున్నదో? ఎక్కడే బొందవున్నదో? ఆయన చూపుతోనె గ్రహించుకుంటడు.

నర్సయ్య: మన లోపలనుంచె యెవరైన పోయి చెపితె అయిపోయె... అదెంత ఘనం? తెలియనంతవరకే ఏదైన...

పుల్లయ్య: నిజమే... కాని, ఆయన జాగ్రత్తలో ఆయన లేడంటవా?

నర్సయ్య: ఏదినం ఎట్లవచ్చునో? చెప్పి వస్తయ్యా?

పుల్లయ్య: అంతే... కాని, మొన్న బాగ చేసిండట.

నర్సయ్య: బాగనా!... మరి బాగనా

పుల్లయ్య: నిద్రలో వున్నా... మానోడు వచ్చి చెప్పిండు నాకు... సరిగ్గా విన లేదు నేను.

నర్సయ్య: ధర్మాగారంలో గవళ్ళోళ్ళ దుకాణాల మీద పడి, వాళ్ళ తన్నుత, గుద్దుత, అని బెదిరించి గొంతుకదాక తాగి చాకట్లో పన్నడట పోలీసోడు. నరసింహారెడ్డి వాడు, వాడు పని ఆరోజె వచ్చిండట. గవళ్ళోళ్ళపోయి, యిదేమి అన్యాయమయ్యా, యిట్లయితె మేము మా యిండ్లనె ఉండలేము, అని ఆయనతోని మొరపెట్టుకున్నరట. నరసింహారెడ్డి ఆ అర్ధరాత్రి పోయి పండుకున్న వాణ్ణి పక్కగా కూర్చొబెట్టి వాళ్ళకు పైసలు యిస్తవా? లేదా? అని గట్టిగా అన్నడట. తెల్లముఖంవేసి, గడగడ వణుకుకుంటు అప్పటికప్పుడు యిచ్చిండట పైసలు.

పుల్లయ్య: వాళ్ళకు యిప్పుడు చాలైంది కోళ్ళు దొరుకుతలేవు. గొర్లు దొరుకుతలేవు. ఎట్టిలేదు. గొట్టంలేదు. ఊళ్ళెకు వస్తె మందలంబేటోడెలేడు. బజార్లకుక్కగూడా లేస్తలేదు వాళ్ళకు,

నర్సయ్య: మరి ఆమీన్ నరసింహారెడ్డి మీద మండుతున్నడట. దొరికితె చంపేద్దామని చూస్తాండట

పుల్లయ్య: ఇక ఏమిచేస్తడు మరి? తిన్న ప్రాణాలాయె ఎక్కడ ఏమి దొరకకుంట ఆయె... ఊళ్ళమీదపడి యిష్టముచ్చట్లు దోచుకొని తిని బ్రతికె నోళ్ళకు యిప్పుడు నోళ్లు కట్టేసినట్లు అయింది. జీతంరాళ్ళు ఎక్కడికయితయి... యిక మండదు మరి?

నర్సయ్య: కనపడితె నిలువున మింగుదామని ఉండొచ్చు వానికి.

పుల్లయ్య: దొరికితెనా?

నర్సయ్య : అబ్బా! దొరికితే ఇంకెక్కడిది? మళ్లీ మనుసులముఖం చూడనిస్తాడు? అంతమంట వున్నది వానికి.

పుల్లయ్య : నరసింహారెడ్డికి మంచి పేరొచ్చింది. ఎవడు ఆయనను తలచుకోవడమె...ఎవడు ఆయన సంగతి చెప్పడమె...ఎక్కడవిన్నా ఆయనగూర్చి వినడమె...

నర్సయ్య : మనతాలూకాఅంత ఆయనను తలవని ఊరులేదు.

పుల్లయ్య : తాలూకా ఏంది? దేశంఅంత అనుకుంటున్నరు ఆయనపేరు. కోళ్లు పాయె, గొర్లుపాయె, దండగలుపాయె, దోపాలుపాయె. తన్నులు తప్పె - గుద్దులుతప్పె. ఊరోళ్ళమీద వేలు పెట్టి చూపినోడె లేడాయె యిప్పుడు? యిక ఎందుకు అనుకోరు,?

నర్సయ్య : నరసింహారెడ్డి......

(యిద్దరు నైజాం పోలీసులు ప్రవేసిస్తారు)

ఒ. పో : నరసింహారెడ్డి ఎవడు? వాని ముచ్చట పెట్టుకుంటున్నరు,?

నర్సయ్య : మా తమ్ముడు,?

ఒ. పో : మీ తమ్ముడా? మీతమ్ముని సంగతేనా? మీ తమ్ముడు ఎక్కడ ఉన్నడు,?

నర్సయ్య : బర్లకాడ ఉన్నడు,

రెం. పో : నిజంచెప్పు ......నరసింహారెడ్డి ఎక్కడ ఉన్నడు,?

నర్సయ్య : యిప్పుడుచెప్పేది అబద్ధమా? మాతమ్ముడు ఎందుకు?

ఒ. పో : వాడు బాగ నేర్చిండుమీకు. అయితె మీ ఊళ్లోనె ఉన్నడు నరసింహారెడ్డి,?

పుల్లయ్య : మాకు తెలియదు,

రెం. పో : మీ యిళ్ళకు పద!

నర్సయ్య : మే మెందుకు,?

ఒ. పో : నడవు. పనిఉన్నది మీతోని,

నర్సయ్య : మాకు తెలియదు.

రెం. పో : యిళ్ళళ్ళో దాచిపెటుతారు? దొరకనీయి మీరూపోతారు వానితోని

నర్సయ్య : దొరికితే తీసుకపో

ఒ. పో : నీవు నడవాలె,

నర్సయ్య : మాకు పనులున్నయి,

(దారిపడుతాడు)

రెం. పో : ఏయ్! నిలవబడు,

నర్సయ్య : ఎందుకు,?

రెం. పో : నిలబడు!

నర్సయ్య : ఏంది చెప్పు

(నర్సయ్య నిలబడతాడు. ఒకటో పోలీసు అతనిచేయి పట్టుకుంటాడు. పుల్లయ్య జారుకుంటాడు)

ఒ. పో : నాతోని కచేరికి నడువు!

నర్సయ్య : ఎందుకయ్యా,?

ఒ. పో : నీవు నడస్తవా? లేదా?

నర్సయ్య : ఏమి దొంగతనం చేసినా ?

రెం. పో : అక్కడికి పోయినంక తెలుస్తదిపా,

నర్సయ్య : ఏమిటో ఆ నేరము; యిక్కడ చెప్పరాదు!

రెం. పో : మీకు బాగా బుద్ధి చెపుతా...
చూస్తుండు,
నర్సయ్య : యిక నీకోసె నేర్చుకోవాలె
బుద్ధి,
ఒ. పో : నోరు జారనియ్యకు,
నర్సయ్య : ఏందిమరి? నడిఊళ్లో దొంగను
పట్టుకున్నట్టు పట్టుకొని, 'క చే రి కి
నడవు',...'కచేరికి నడవు'... ఏమి
తప్పు చేసినా ?

(యింతలో గొంగడి కొప్పెర వేసుకున్న నరసింహారెడ్డి చంకలో లావాటికర్రతో మెల్లగావస్తాడు)

నరసింహ : ఏమితప్పు చేసిండు వీడు,?
రెం. పో : ఎవరునీవు,?
నరసింహ : ఏమితప్పుచేసిండంటుఉంటె,?
ఒ. పో : నీ పేరు,?
నరసింహ : నా పేరు చెపుతా కాని వీడి
తప్పేమి టో చెప్పు మొదట?
రెం. పో : నీకేమి అక్కర ? నీవెవడవు?
నర్సయ్య : అమీన్ కచేరికి తీసుక పోతా
డట,
నరసింహ : నీవు చాలవూ...దొరవు!
ఒ. పో : నీవు నరసింహారెడ్డివికమా....
నీవె కాదు ?
నరసింహ : నేను యిదిగో వీడిని,

(కర్రతీసి గట్టిగా దెబ్బ కొడ తాడు)

రెం. పో : అరేయ్... చంపాడు,
నరసింహ : వాడిని విడువు నీవు,

(విడుస్తాడు)

నరసింహ : యిక మీ అమీన్ దగ్గరకు
పోయి నా పేరు చెప్పు,
ఒ. పో : నీకు యింత బలం వచ్చిందీ?
నరసింహ : కోళ్లు, గొర్రెలు తిని,
ఒ. పో : చూస్తావు ఉండు!
నరసింహ : వచ్చినవాడివి దారి వెంబడిపోక
దారిని పోయేవాళ్ళను ఏడిపిస్తావు ?
రెం. పో : మంచిది,
నరసింహ : మాట్లాక వెళ్లు,

(యిద్దరూ భయపడుతూ తిరిగి, తిరిగి, చూస్తూపోతారు)

నర్సయ్య : మీరు రాకపోతె ?
నరసింహ : ప ట్టు క పో యి నాలుగో
అయిదో కాజేసును.
నర్సయ్య : మీ ముచ్చటే పెట్టుకుంటు
న్నను. మీ పేరు విని నరసింహారెడ్డిని
చూపుమంటు వచ్చిండు.
నరసింహ : యి కే మి; చూచాడుకదా!
పోలీసులు...పోలీసులు అనిఎగబోసు
కుంటు ఊరికి వచ్చిండు నా దగ్గరికి
పుల్లయ్య. నేను ఏమిటో అనుకున్న!
నర్సయ్య : మిమ్మల్ని గుర్తుపట్టాడు
నరసింహ : పట్టనీయి ఏంభయం ?
నర్సయ్య : మనం యిక్కడ ఉండవద్దు
నరసింహ : యికేమిపని !

(వాళ్లిద్దరూ పోతారు. మరికాసేపటికి పారిపోయిన యిద్దరు పోలీసులు భయపడుతూ బెదిరిచూస్తూ (ప వేసిస్తారు)

ఒ. పో : నా బీటుబుక్కు పోయింది,

రెం. పో: నా బిళ్ళ లేదు.

ఒ. పో: యిక్కడే పోయింది అది

రెం. పో: (యిద్దరూ క్రిందికి వంగి వెతుకుతుంటారు) తొందరగా మెడమీద నుంచి జారింది... నేను కనిపెట్టలేను.

ఒ. పో: గొండివాడు నరసింహారెడ్డి,

రెం. పో: లేకపోతే యింకొకనికి యింత బలం ఎక్కడిది?

ఒ. పో: వాణ్ణి పట్టుకోకపోతే మనపని ఊత్ర దే.

రెం. పో: ఊళ్లలో మనం తిరగలేము యిక,

ఒ. పో: వీడు ఏమిచేస్తాడో చూడు పట్వారిని రక్షించ రాలేదు చూడు.

రెం. పో: ఎలాగో చెప్పండో లేదో! అయినా యిక్కడికి వచ్చి కచేరికి పిలిపించుకుందాము.

ఒ. పో: బీటుబుక్కు యిదిగో,

రెం. పో: నా బిళ్ళ యిదేంది!

(ఇద్దరూ నిష్క్రమిస్తారు)

## రెండో రంగం

(ఊరుచావడి. అర్థరాత్రివేళ. లాంతరు ఒకటి వెలుగుతూ ఉంటుంది. అమీన్ మంచంపై కూర్చుని కునికిపాట్లుపడుతూ, అప్పుడప్పుడు ఎవరికోసమో ఎదురు చూస్తుంటాడు. మంచంపైన తోటాలునింపిన పిస్తోలుఉంటుంది.)

అమీన్: వీళ్లుపోయి చాలసేపైంది...... యింకా రాలేదు? ఏమికావచ్చు? పట్వారీ.... 'ఉన్నాడయ్య... తప్పక ఉన్నాడు...దొరకక తప్ప'దని బట్టన్ని వేసుకున్నాను. పట్వారి ఏమైనా చేయలేదుకదా! ఎవణ్ణీ నమ్మేటట్టు లేదు. కాలం యింతా మారిపోయింది. పైకి 'హుజూరు... హుజూరు' అని అన్నా లోపల పూర్వపు భయం, భక్తులు ఒకడికీ లేవు. ఏమిటి వీళ్లు? నేను పోతే యింతసేపు పట్టేనా? పట్వారి స్వంత మనుష్యుల నిద్దపరిచానని చెప్పినాడు. ఏమిచేసిందో! నిద్ర మొఖం? ఈ కదలిక అంతా వాడు ఏ కష్టంగుండానో కనిపెట్టి ఊడాయించిండేమో! వీళ్ళ తెలువులు యింతే.

(ఇంతలో ఉద్వేగంగా మాట్లాడుకుంటున్న మనుష్యుల చప్పుడు వినబడుతుంది. ఆ చప్పుడు విని అమీన్ పిస్తోలుతీసుకొని లేచి ఆ ధ్వని ఏమిటో కుతూహలంగా వింటూ అటు యిటు తిరుగుతుంటాడు. చప్పుడు మరింత దగ్గరౌతుంది. యింతలో నరసింహారెడ్డినిగట్టిగా తాళ్ళుకోసి ఆ ఇద్దరు పోలీసులు పట్టుకొని వస్తారు.)

అమీన్: పట్టుకున్నారు! శాబాస్! నాకు నమ్మకమే లేకుండె మీరు పట్టుకుంటారని. చాల గొప్ప పని చేసిన్రు. తీసుకరాండి యిటు.

ఒ. పో: దొరకక ఏమిచేస్తడు! యిటువంటోళ్ళు లక్షలు అయిన్రు వీడు లెక్క!

అమీన్ : మంచిపని అయింది, మంచిపని అయింది.

రెం. పో : మా ప్రాణాల తిన్నాడు.

అమీన్ : మీ ప్రాణాలు తిన్నాడా? ఏమిరా! వాడి ప్రాణాల మనం తిందాము.

రెం. పో : చేతి కొచ్చేవరకు ఏమైతదనో భయం ఉండె. తుపాకి గురిచూపక పోతె పారిపోయెటోడె.

అమీన్ : యిటు పట్టుకరండి. ఏమి, పోలీసులంటే నీకు పరవాలేదు కదు?

( నరసింహారెడ్డి మాట్లాడడు. గంభీరంగా నిలవబడిఉంటాడు.)

అమీన్ : అరేయ్...ఒక తన్ను తన్నరా?

ఒ. పో : దొరకంగనె విడిచినాను...... వల్లంతా పొదగిందిబాగ....

రెం. పో : ఆరోజు మా మీద తిరగబడింది తప్పక వీడె.

అమీన్ : ఎవడురా?

నరసింహారెడ్డి : నాకు తెలియదు.

అమీన్ : నీవు తప్ప ఈ తాలూకాలో మరోడికి దమ్ములేదు. నీవో, నీపార్టీలో వాడో...

నరసిం : నాకు తెలియదు.

అమీన్ : పోలీసువాళ్ళ గుండెల్లో నిదుర పోతావేమొకదా! చెప్పురా?

నరసిం : నేను అనలేదు.

అమీన్ : నీవు అనలేదు? నీవు ఏమిచేయలేదు? వీణ్ణి కొట్టింది ఎవడు?

నరసిం : నాకదేమి తెలియదు.

అమీన్ : అరేయి...వీడినాలుక గుంజరా..

ఒ. పో ; అరేయి...చెప్పు, వల్లుపగులుతది.

అమీన్ : పోలీసులంటె గడ్డిపరక అయిపోయింది.

ఒ. పో : ధర్మారం చావడిలో బీటుజవాన్ నిదురపోతె పదియాదిని తీసికొనివచ్చి తన్నిపోతాడు?

అమీన్ : నీవేనారా?

నరసిం : నాకు తెలికని సంగతి నేనేమి చెప్పను?

అమీన్ : నీకు తెలియదు? మాటల తోని చెపుతావు? అరె! హమీద్!

(ఒకటో కానిస్టేబిలు చేతి కర్రతో మోకాళ్ల పైన గట్టిగా కొడతాడు)

నరసింహా : అబ్బా...అబ్బా...

అమీన్ : అబ్బా! యింకోటి తిన్ను.

ఒ. పో : అప్పటికన్నా బాగాఅయితది... చెప్పు? ఉత్తగపోదు యిది...ఏమి అనుకున్నావు!

(ఇం కొకటి కొడతాడు)

రెం. పో : తన్నులతో చచ్చిపోతవు. చెప్పు

నరసింహా : నాకేమీ తెలియదు

అమీన్ : అరేయ్! వీనికి అట్లాకాదు. యింకా కొట్టాలె.

ఒ. పో : మా దెబ్బలకు భూతాలు ఝుసస్తయి. నీ కేందిరా? యిదిగో చూడు? నీవు ఎట్లా చెప్పవో...

(గట్టిగా కొడతాడు)

నరసింహా : చంపాడి...మీ యిష్టం.

రెం. పో : చెప్పేదాకా విడవం. చచ్చిపోతవు.

నరసింహా : చంపండి... నా కేమీ తెలియదు.

ఒ. పో : ఏమీ తెలియదు ?

నరసింహా : తెలియదు.

అమీన్ : తెలియదురా ?

(బూటు కాలుతో కడుపు మీద తంతాడు)

నరసింహా : అబ్బా! అబ్బా! నొప్పి...

(బాధతో కళ్లు మూస్తాడు)

ఒ. పో : చెప్పు యిక! చచ్చిపోతవు!

అమీన్ : చస్తేచచ్చె! పోలీసువాళ్ళ మీద తిరగబడి చచ్చిపోయిండని పంచనామా చేస్తా!

(నరసింహా రెడ్డి కడుపు మీద రెండు చేతులు పెట్టి బాధపడుతుంటాడు)

ఒ. పో : అరె! లే! ప్రాణం పోలేదు.

రెం. పో : మొండి రాక్షసులు. వీళ్ళు చావరు.

అమీన్ : కనపడగానె గోలవేయనుంటిరి.

ఒ. పో : గుడిసెలో పండుకున్నడు. మా అడుగుల చప్పుడు విని తెలివి వచ్చిందేమొ! తొందర పుట్టింది. ఎటు పోయిన లాభం లేదనుకొని ఒక ఎత్తు వేసిండు యిక. తలుపు తోయంగనె బయటపడుదామని మెల్లగ గొళ్లెం తీసి తెలివిగా పోయి దర్వాజా మూలకు నిలికిండు. నేను యిదంతా చూడక తలుపు తోసుకొని లోపలికి పోయినా. నా వెనక యలవోడు ఉన్నడు. ఇద్దరము లోపలికి రాంగనే యిక అయిపోయింది అనుకున్నడు. దబ్బున లేచి ఉరకపోయిండు. దర్వాజాలో అడుగు పెడుతున్న పట్వారిని చూడలేదు. వానికి పోయి గట్టిగా తాకిండు. పట్వారి అట్లనె పట్టుకున్నడు. యిక విడవలే. యిద్దరు బాగ కలియబడ్డరు. పట్వారిని కింద పడేసి బయటపడేటోడె. యింతలో నేను ఉరికి 'కదిలితే కాలుస్తా'నని తుపాకి చూపెట్టినా. యిక అట్లనె చచ్చినోనితీరు భూమికి వంగిండు.

అమీన్ : ఉడాయించనుంటిరి.

ఒ. పో : పట్వారి, వీడు కలెబడ్డరు. లేకుంటే అయ్యేదే.

అమీన్ : వీడు పోతే ఈ తాలూకా మొత్తం గొల్లి లేకుండ అయితది.

రెం. పో : బాగా నేర్పిండు రైతులకు. కోడి యివ్వకు, గుడ్డు యివ్వకు, మూటలు మోయకు, వెట్టి చేయకు; యిది పాఠం అయిపోయింది అందరికీ.,

(నరసింహా రెడ్డి బాధపడుతుంటాడు)

ఒ. పో : అరేయి! యింకేమైంది. లే,

అమీన్ : తన్ను ఒకటి. నడుం చక్కగా అయితది...

రెం. పో : రైతులంతా వీని పాట బాగ నేర్చిండ్రు. మొన్న గణేశపురంలో పాకలదాన్ని మూటకు రమ్మంటె 'పైసలు తే వస్తా'నన్నది. మూతిపండ్లు విరగకొట్టినా.

రెం. పో : రాంపురంలో ఏమి చేసిండు ? వెంకటాపురం నుంచి కోళ్లు తెచ్చి

చావట్లో పెట్టి ఊళ్లోకి పోయినా. వచ్చే వరకు కోళ్ళన్నీ పడిచి పెట్టించిండు. వీడు తప్ప మరోడు కాడు.

ఒ. పో: తాలూకా మొత్తం పాడు చేసిండు. మునుపు పోలీసు కానిస్టేబలు అంటే ఊరంత యట్ల భయపడేది! యిప్పుడు బాట పోయే ఆడదికూడ రామకపోతది.

అమీన్ : దంచేయండి వెధవను.

(నరసింహారెడ్డి గోడకుఆనుకుని నొరిగి కడుపు పట్టుకొని బాధ పడుతుంటాడు)

ఒ. పో: బాగ తగిలింది వెధవకు.

అమీన్ : బూటు దెబ్బ! ఝూడించి తన్నినా.

ఒ. పో: అరేయ్ ! ప్రాణం పోదులే.

రెం. పో: యిట్లా చెప్పడు వీడు. కళ్లలో కారం పెట్టాలె.

అమీన్ : మంచి మందురా. పట్వారి యింటికి పో.

(రెండవ పోలీసు పోతాడు)

ఒ. పో: అరె చెప్పు. వల్లంతా పగలగొట్టు తాకర.

అమీన్ : ఒక్క తన్నుతో యేమైంది? [illegible] చెప్తావు.

[illegible]: [illegible] పోలీసు [illegible] కళ్ళు భగ్గుమంటాయి [illegible].

అమీన్ : [illegible] ఏమిచేసు. పిల్లలాగ ఐపోయింది.

(రెండో పోలీసు వస్తాడు)

ఒ. పో.: హు...యిక కండ్లు తెరువురా

(నరిసింహారెడ్డి తన బాధ తాను పడుతుంటాడు.)

ఒ. పో.: నీవెక్కడ చస్తవు? కండ్లు తెరువు.

(ఒకటో కానిస్టేబులు నరసింహారెడ్డి కళ్ళు బలవంతంగా తెరిపిస్తాడు. రెండో కానిస్టేబులు కళ్ళలో కారం కుక్కుతాడు.)

నర్సింహా: అబ్బా. కళ్లు...పాయె.

అమీన్ : చావు...యిక చెప్పు. నీవు ఎవన్నెవణ్ణి కొట్టింది.

నర్సింహా: నాకేమి తెలియదు.

అమీన్ : లేకపోతె ఆ కొట్టిన వాని పేరు చెప్పు.

నర్సింహా: అబ్బా! ఎవరైంది నాకు తెలియనే తెలియదు.

అమీన్ : ఇక నీవె చెప్తవు.

నర్సింహా: అబ్బా! కళ్లు భగ్గుమంటున్నయి.

రెం. పో.: ఇంకా అంటయ్.

నర్సింహా: కళ్లు కనబడటంలేదు.

ఒ. పో.: బాగ కనబడతయ్ యిక.

నర్సింహా: అమ్మో.. అమ్మో... కళ్ళు మాడిపోతున్నయ్.

ఒ. పో.: మాడిపోనియ్. సరి కానియ్.

నర్సింహా: అయ్యో!...అయ్యో!...

రెం. పో.: ఏడ్వు.

నర్సింహా: కండ్లు...కండ్లు.

రెం. పో.: ఎక్కడికీ పోవు.

నర్సింహా : కండ్లు...కండ్లు...నిప్పులు పోసినట్టు మండుతున్నయ్.

రెం. పో : ఏమనుకున్నవు ?

నర్సింహా : అయ్యో...మంట...మంట.

ఒ. పో. : తెరువు...మళ్ళీ. ఒకసారి పెడతా.

నర్సింహా : అయ్యో...అయ్యో...

(అటు యిటు చూడటానికి ప్రయత్నిస్తాడు.)

అమీన్ : ఇప్పుడైనా చెప్పు. నీవు కాక పోతే యెవడో వాని పేరు.

నర్సింహా : ఎవడైంది నాకు తెలియదు.

అమీన్ : అరేయ్...నిన్ను వదిలేస్తాము వానిపేరు చెప్పు.

నర్సింహా ; అబ్బో! నాకెవడూ తెలియదు. నిప్పులు కురుస్తున్నయి

ఒ. పో : ఈ రాత్రి వీణ్ణి యిక్కణ్ణుంచి తీసుకపోవాలె.

అమీన్ : ఊ...ఊ ... తెల్లవారితె లాభంలేదు.

రెం. పో. : నడిచేనా ? వల్లంత మెదిగింది

అమీన్ : తన్నండి...వీడు మనదగ్గర వద్దు...భూతం! తెల్లవారక ముందే ఊరు దాటించాలె.

ఒ. పో. : అవును తెల్లవారక ముందే ఊరు దాటించాలె.

రెం. పో. : రిమాండు చేయించాలె ?

అమీన్ : నా పేరు చెప్పండి. ఒంటరి గంజ్ లో వేయరునండి,

రెం. పో: గోడనుంచి కదులుతలేదు. నడిపించేనా?

అమీన్: గుంజుక పోండి లాభేవుందా ?

ఒ. పో. : అరే! నడవు యిక.

(రెండో పోలీసు చేతులకు సంకెళ్ళు వేస్తాడు.)

అమీన్ : సరిగా పడ్డాయో లేదో జూచుకోండి!

ఒ. పో. : (కప్పు చూస్తాడు) ఇక ఎక్కడికి పోతాడు ?

అమీన్ ఇదిగో కాగితం...భద్రం మరి.

ఒ. పో. : వాని నెక్కడ విడిచి పెడతాము. శవాన్ని అయినా గుంజుక పోతాము.

అమీన్ : అంతే.

ఒ. పో. : నడువు.

(నరసింహారెడ్డి నొప్పితో నీరసంగా నడుస్తాడు.)

మూడో రంగం

(నరసింహారెడ్డి చేతులకు కప్పువుంటాయి. బాధతో నీరసంగానడుస్తు వుంటాడు. పోలీసులు నరసింహారెడ్డి పైన విసుగుకుంటూ వుంటారు.)

ఒ. పో : అరేయ్! యింకా అయిదుమైళ్లు నడవాలె.

నర్సింహా : నా చేతనైనంత నడుస్తున్నా.

రెం. పో : యిక్కడే రెండుజాములైంది. వీడు ఈరోజు వుపాసంపండ పెడుతడు.

ఒ. పో : ఉపాసం, మనకేంది? రాంపురంలో మంచిగా పటేలునుపిలిపించి...

రెం. పో : ఏమన్నా ఉన్నాయ్ జేబులో?

ఒ. పో : ఏమన్నా ఉంటేసరే, లేకపోతె ఈ రోజు నీకు ఏకాశి.

నర్సింహా: నావొళ్లు తిరుగుతూంది. కొంచెం కూర్చుంటా.

రెం. పో: తిండి అనేవరకు నీనికి చేత కాకుండా అయింది

నర్సింహా: నా కేమీ కనపడటం లేదు. ప్రాణం చుట్టుకపోతుంది, నేను నడవ లేను.

(కూర్చోబోతాడు.)

ఒ. పో: అరే, నడువు... చావట్లో పండు కుందువుపా.

రెం. పో: అదేమిటి, ఊరు!

నర్సింహా: ఏమన్నా తిరంది నాచేత కాదు నడవను.

(నేలమీద చతికిలబడతాడు.)

ఒ. పో: అరె... పా... ఊళ్లోకి. ఇక్కడేమున్నది?

(కదలడు.)

రెం. పో: ఊరుదగ్గరకివచ్చి కూచుంటవా?

(తలవంచుకొని అట్లాగే కూర్చుంటాడు.)

ఒ. పో: అడవిలో ఏమి దొరుకుతది? ఊళ్లోకిపోయి ఒకఅరగు. అప్పుడు...

(మాట్లాడడు.)

రెం. పో: కోమటియింట్లో ఏమున్న తిందువు పా.

ఒ. పో: లే...

(నరసింహారెడ్డి కణతలు పట్టుకొని బాధపడుతూ లేస్తాడు. నర్సింహారెడ్డి, పోలీసులు ఊరికిఫర్లాంగు దూరంలో చేరుతారు. చావడిలో నర్సింహారెడ్డి గోడకు చేరగిలబడతాడు. పోలీసు ఎలవాణ్ణి కూతలు వేస్తాడు. గుడిసెలోవున్న ఎలవాడు ఉరికివస్తాడు. ఎలవాడు క్షణంలో పోయి పోలీసువాళ్ళు వండుకోడానికి బియ్యం, ఉప్పు, చింతపండు, మిరపకాయలు, కాసిని పాలు తెస్తాడు. నర్సింహారెడ్డి పాలుతాగి కొంచెం తెప్పరిల్లుతాడు.)

ఒ. పో: (రెండో పోలీసుతో) అన్నం తొందరగా కానీయ్. యిక్కడ్నే చీకటి అయితది.

రెం. పో: (నరసింహారెడ్డితో) అన్నం... అన్నం... అని చస్తూంటివి. ఈ ధనిగాలు కొంచెంనూరు. అట్లనె అల్లం... మిరపకాయలు.

నరసింహా: మంచిది.

రెం. పో: అరేయి... మరచినా. ఎలోడూ! కోడి తీసకరారా!

ఎలవాడు: అయ్యా... దొరుకుతది.

ఒ. పో: హాత్... ఉరుకు.

రెం. పో: అల్లం బానూరు.

(నరసింహారెడ్డి నూరబోతాడు. కాని సంకెళ్లు అడ్డం రావడం వలన నూరరాదు.)

నరసిం: వీలు కావటంలేదు.

ఒ. పో: కప్పు తీసెయ్! యిప్పుడు పోతాడూ! అయినా స్తిచాలదూ!

(రెండోపోలీసు తీస్తాడు.)

రెం. పో : యింక నూరు. ఎట్లాఉండాలె? మెత్తగా.

నరసిం : నూరుత.

(తలవంచుకొని నూరుతుంటాడు.)

రెం. పో : వీడికి అన్నీ వచ్చు.

ఒ. పో : రానిదే అడవులపాంటి తిరుగుతాడు!

రెం. పో : అల్లం అయిందా?

నరసిం : అయిపోయింది

ఒ. పో : ఎల్లిపాయ?

నరసిం : అయింది.

రెం. పో : మిరప కాయలు?

నరసిం : నూరుతున్నా.

ఒ. పో : మెత్తగా పిండిమాదిరి... మాంసం కూర మరి!

నరసిం : నూరుతా...

(నరసింహారెడ్డి కళ్లలో నూరుతున్న పొడుం పడుతుంది. ఆ మంటలో ఏదో ఆలోచన స్ఫురిస్తుంది. ఆలోచిస్తూ కళ్ళు నలుచుకుంటాడు)

ఒ. పో : మళ్ళీ పడ్డది కారం?

నరసిం : పరవాలేదు- పోయింది.

ఒ. పో ; మెత్తగానూరు- తొందరుపడకు.

నరసిం : మెత్తగా నే నూరుత.

రెం పో : నాకు చూపాలె.

నరసిం : చూపుత.

రెం. పో : ఎలవాడు రాలేదు మాడు.

ఒ. పో. కోడిదొరకవద్దూ.

రెం. పో : అరె! మళ్ళీ యిటువంటి తిండి దొరకదు.

ఒ. పో : జైల్లో పడ్డాక యింకనా?

రెం. పో : జైల్లో జొన్నరొట్టె. చింత పులుసు.

నరసిం : కారం అయింది తీసుకునా!

రెం. పో : యిటు చూపు, ఎట్లానూరినవో-

(నరసింహారెడ్డి ఉత్సాహంగా రెండు దోసిళ్ల కారం వాళ్ల మధ్యకు తీసుకుపోతాడు. రెండో పోలీసు వేలుపెట్టి దానిని పరీక్షిస్తుంటాడు. నరసింహారెడ్డి అకస్మాత్తుగా ఆ కారాన్ని వాళ్ల కళ్లలో గుప్పి ఒక్క గంతులో బయటపడతాడు)

ఒ పో : అరేయ్! (బాధపడుతుంటాడు) పోయె, పోయె.

రెం పో : అబ్బా! ఉరికె, ఉరికె.

ఒ. పో : (మంటకు ఆ లేక కళ్లు నలుచుకుంటూ లేస్తాడు.) అబ్బా! కళ్లు పోయె...ఎట్లా?

రెం. పో : అరేయ్! ఎలవాడు? మంట మండుతున్నయ్...

(కళ్ళు నలుచుకుంటూ లేచి బాధపడుతుంటాడు)

ఒ. పో : యింక దొరకదు...మంట...మంట

రెం. పో : అరేయ్ -- ఎలవాడూ?

(భయపడుతూ ఎలవాడు ప్రవేశిస్తాడు)

ఎల : అయ్యా! కోడి దొరకలే, గుడ్లు తెచ్చినా.

ఒ. పో: నెత్తిన కొట్టుకో. గుడ్లు మండి పోయె.

ఎల: అయ్యో! అదేంది? ఏమాయె?

రెం. పో: అరె! ఉరుకు, ఉరుకు. వాడు పోయె.

ఎల: ఎవరయ్యా?

ఒ. పో: ఎవరయ్యా! అరె! వాడు! పట్టుకో పో.

ఎల: అయ్యో! ఏమాయె? ఎటుపోయె?

ఒ. పో: ఉరుకురా.

ఎల: ఎటు?

ఒ. పో: ఉరుకురా! అబ్బా! కళ్లు చితికిపోతున్నయ్.

రెం. పో: ఉన్నదంతా నా కళ్ళనె పడ్డది. మంట! అబ్బా!

ఎల: అయ్యో! కారం అంతా చల్లిండు.

ఒ. పో: అరె! ఉరుకుతావా? లేదా?

ఎల: ఎటు ఉరకా?

ఒ. పో: బాట పొంటె ఉరుకు. మంట అబ్బా!

ఎల: ఎంత దూరం పోయెనో?

రెం. పో: యిప్పుడే...యిదిగో... ఊరు దాటెనో లేదో? ఉరుకు. అబ్బా!

ఎల: అయ్యా! పోతున్నా ... యిదిగో గుడ్లు.

ఒ. పో: అడ పారేయ్! గుడ్లు! అరె! మంట! మంట!

రెం. పో: నా తల తిరుగుతుంది. అబ్బా!

ఒ. పో: కారం బాగ మండుతది!

రెం. పో: నాకు తెలువదు! యిట్ల మండుతదని.

ఒ. పో: అబ్బా!

రెం. పో: హఁ! వాని తెలివి చూడు.

ఒ. పో: తెలివా? తెలివా? చెప్పే తెలివి కాదు.

రెం. పో: అందుకే సర్కారుకు—

ఒ. పో: భయం—భయం—వీళ్ళంటేనే భయం.

రెం. పో: నేను యిట్ల అనుకోలె — మంట.

ఒ. పో: హూఁ! నేనూ అనుకోలె.

రెం. పో: ఎంత దూరం పోయెనో. ఏమి మంట యిది? నౌకరీ ఊడటానికే.

ఒ. పో: యిక దొరకడు వాడు.

రెం. పో: యిక ఎక్కడిది? అమ్మో! మంట. అమీన్ లంజకొడుకు ఊరుకుంటడా?

ఒ. పో: హా...హా...కండ్లలో నిప్పులు పడ్డయ్ ... మనకి డబుల్ పంజ్ భాగ్యం.

రెం. పో: మంట! మంట!

(బాధ భరించలేక తలలు పట్టుకొని యిద్దరు భూమిమీద కూర్చుంటారు)



# లేఖలు

## 1

మహాశయా!

మార్చి నెల సంచిక అభ్యుదయలోని నే రాసిన 'తెలుగుసారస్వతంలోని దేశభక్తి' అన్న వ్యాసాన్ని శ్రీ ఎ. సోమసుందర్ గారు ఏప్రిల్ సంచిక తమలేఖలో 'అసంపూర్ణంగా పూర్తి అయింది' అని విమర్శించారు.

కాని ఆ శీర్షికతో వరుసగా మూడు నాలుగు వ్యాసాలు రాయాలని సంకల్పించి అది సూచించడానికి గాను వ్యాసం పైన 1 (ఒకటి) అన్న అంకెను వేశాను. క్రింద "ఇంకా ఉంది" అని సూచించలేదు. పైన వేసిన ఒకటి అంకెను వారు చూచి ఉండకపోవచ్చు.

వ్యాసం, దేశమంటే, దేశభక్తి అంటే ఆధునిక శాస్త్రబద్ధమైన నిర్వచనంతో ప్రారంభమైంది. మధ్య యుగంలో రాజకీయ స్వభావమైన దేశభక్తిని, ప్రజలపరంగా నిర్వచించింది నాకు తెలిసినంత మట్టుకు ఒక్క శ్రీనాథుడే గాబట్టి, అదే రాశాను. భారతంలో, భాగవతంలో రాజులపైన తిరగబడిన ఘట్టాలు కొన్ని ఉన్నాయి; ఉదా: వేన చరిత్ర. అలాంటివి కొన్ని సంఘం స్వతంత్రంగా ముందుకు పోకుండా బ్రాహ్మణమతం కాస్తో కూస్తో ఆనాటికి ప్రజలకు దగ్గిరగా ఉన్న రాజులను కూలదోసిన ఘట్టాలే. పోతన గారు రాజరికంమీద తిరుగుబాటు రామపాదాలు పట్టింది.

శ్రీనాథుడు అని కాలానికి దేశభక్తుడే. బ్రాహ్మణమతంవల్ల నలిగిపోయిన శైవ కుటుంబీకుడు. తన శైవంయొక్క ఉచ్చస్థితి రోజులను మరచిపోనివాడు. మధ్య యుగంలో మరి ఏ కవికీ లేని విశిష్ట స్థానం యిచ్చినది. కాని ఆయన దేశభక్తి ఫ్యూడల్ పరిధులను దాటలేకపోయింది. అందుకు కారణంచూపడానికే 'మార్క్స్' నుంచి ఆ వాక్యాన్ని ఉదహరించాను.

ఆతరువాత వ్రాయదలచిన వ్యాసాల్లో 1 మితవాద జాతీయవాద దశ, 2 తీవ్ర జాతీయవాద దశ, 3 వర్గకలహ ధోరణులు. 4 ప్రజా సంఘటన దశయని నాలుగు భాగాలుగా ఆధునిక తెలుగు సారస్వతంలో దేశభక్తిని సమీక్ష చేయదలచాను. మార్క్స్ నిర్వచనాన్ని రుజువుచేయ దలచాను.

మార్చి నెలసంచిక వ్యాసం కేవలం ఉపోద్ఘాతం మాత్రమే. దానిలో అవకాశం వున్నంతవరకూ విషయాన్ని విశదీకరించాను. సోమసుందర్‌గారు కోరినట్లు "దేశభక్తిని తెలుగు సారస్వతం ఏదశలో ఎలా నిర్వచించిందో చూపుతూ

తెలుగు సారస్వతాన్నంతటినీ ఎనలైజ్ చేయడం దాని ఉద్దేశం కాదు. అందుకనే స్థలపురాణాలనూ, వీరగాథలనూ, యింకా యితర సాంఘికోద్యమాల సారస్వతాన్ని ఉదహరించడం మాత్రంచేసి, నేరుగా రాజకీయ స్వరూపమైన దేశభక్తినే ప్రత్యేకించి వివరిస్తున్నదా వ్యాసం.

వెంటనే తరువాత వ్యాసాలను ప్రకటనకీయలేకపోయిన పరిస్థితులకు నాపై కోప్పడక క్షమించాలని శ్రీ సోమసుందర్ గారిని, యితర "అభ్యుదయ" పాఠకులను కోరుతున్నాను.

అవకాశం చూచుకుని తెలుగు సారస్వతంలోనే దేశభక్తిని వెలిచెప్పిన శీర్షికల్లో నివేదించుకుంటాను.

— పి. వి. శివయ్య

## 2

మహాశయా!

మీ 'అభ్యుదయ' ఏప్రిల్ ప్రత్యేక సంచికలో శ్రీ 'రాంషా' గారి "ఓహో, ఓ బాటసారి!" (స్మృతి) గీతం ప్రచురించారు. అదే గీతాన్ని 'అరుణ' 'జ్యోతి' 'విశాలాంధ్ర' 'నవోదయ' పత్రికలుకూడా ప్రచురించాయి.

ఇన్ని పత్రికలు ఒక్కసారిగా ఆ గీతాన్ని వాటంతటవే యేరుకుని పునఃపునః ప్రకటించేందుకు అందులో యేమీ విశేషం కన్పించటం లేదు. కనుక బహుశః ఆ రచయితే ఇన్ని పత్రికలకూ ఒక్కసారిగా పంపించివుంటా డనిపిస్తున్నది.

ఆ గీతంలోని బాగోగులమాట అలా వుంచి, తానుగా సంపాదక లేఖల్లో యితరుల రచనల బాగోగుల్ని గురించి చర్చించ గలిగిన 'రాంషా' గారే తన గీతాన్ని రకరకాల శీర్షికల్తో రకరకాల పత్రికలకు యిలా పంపడం న్యాయమేనా? రచనకూ పత్రికా ప్రకటనకు భేదం వుండదా?

—ఎ. పి. రావు.

[శ్రీ 'రాంషా' గారి ఈ ప్రవర్తనను గర్హిస్తూ 'అరుణ' సంపాదకులు వ్రాసిన లేఖకూడా మా కార్యాలయానికి చేరింది. —సం.]

